# ఆంధ్రపత్రిక

J17226



The Andhra Patrika, Madras. Regd. No. M. 1118 Vol. 35 No. 215 MONDAY 8th NOVEMBER 1948 వెల ఒక అణా Founder: K. Nageswara Rao

# "యుద్ధానికి కాలుదువ్వు పెట్టుబడిదారులబలపరచుట క్షేమంకాదు"

# కమ్యూనిస్టు ఉధృతాన్ని అరికట్టేందుకు

## ఆహార వస్తువుల రవాణా కంట్రోలులో మార్పులు

న్యూఢిల్లీ, నవంబర్ 6: ఆహార పదార్థాలపై తిరిగీ కంట్రోలును నెలకొల్పుటచే వాటి రవాణాపై ప్రస్తుతం ఉన్న కంట్రోలులో కొన్ని మార్పులు చేయుట అవసరమైనదని నేటి ప్రభుత్వ ప్రకటన ఒకటి తెలియజేస్తున్నది. ఈ కారణము వలన ఆహారపదార్థాల రవాణా కంట్రోలులో ఈ కింది మార్పులు ప్రకటించబడినవి:

(1) గోధుమ, బియ్యం, జొన్నలు, బార్లీ, ఉలవలు, పప్పుదినుసులు, మొక్కజొన్న—వీటి పిండి, ఒక రాష్ట్రంనుంచి మరొక రాష్ట్రానికి (సంస్థానానికి) రవాణా చేయుటకు కేంద్ర ఆహార మంత్రి కార్యాలయమే అనుమతుల నిచ్చును. వ్యాపారమునకై వీటిని ఇతర రాష్ట్రములకు (సంస్థానములకు) పంపుట అనుమతించబడదు. రవాణాలను కేంద్ర ఆహార మంత్రి కార్యాలయం ఆమోదించినప్పుడే సహాయం చేయబడును. ఒక రాష్ట్రములోనే ఉన్న భిన్నప్రాంతాలకు జరిగే రవాణాలను ఆ రాష్ట్ర ఆహారశాఖవారు (డిప్యూటీ సెక్రటరీ హోదాకు తగ్గని వారు) ఆమోదించవలెను.

(2) ఆహార పదార్థాల రవాణా సౌకర్యాలు మొదలైన వాటి విషయమై రైళ్లలో ఈ కింది పద్ధతులు అనుసరించబడును. (ఎ) త్వరలో చెడిపోయే కూరలు, పండ్లు, గ్రుడ్లు, చేపలు మొదలైనవి త్వరలో వెళ్లుటకు ప్యాసెంజర్ రైళ్లలోనే రవాణా చేయబడును. వీటి రవాణాకు కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల ఆమోదం అవసరంలేదు. (బి) అంతత్వరగా చెడనటువంటి బంగాళాదుంపలు, ఉల్లిపాయలు, ఎండుచేపలు, గుడ్డు రైళ్లలోనే రవాణా కాగలవు. అవసరమైన సందర్భాలలో వీటిరవాణాలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సమర్థించగలవు.

(3) పప్పుదినుసులు, పంచదార, బెల్లం, భోజనంలో ఉపయోగపడే నూనెగింజలు, నూనెలు మొదలైనవాటిరవాణాలో అనవసర ఆలస్యాలను తగ్గించుటకై కొన్ని ముఖ్యమార్పులు చేయబడినవి. ఇదివరకు వీటి రవాణాలో దగ్గరిదగ్గరి స్టేషన్ల వర్తకులు ఒక ప్రత్యేక రైలునిండా సరుకుని ఎక్కించి, దగ్గరిదగ్గరి స్టేషన్లలో దింపుకొనటానికి తయారయితే ప్రత్యేక, రైళ్ళు ఇవ్వబడేవి. ఇప్పుడు వ్యాపారస్తులకు ప్రత్యేకంగా రైళ్ళు ఇవ్వబడవు. వీటిని రవాణా చేయదలచుకున్న వర్తకులు తమ సమీప రైలుస్టేషన్లలో దరఖాస్తులు పెట్టుకుంటే, కేంద్ర రైల్వేమంత్రి కార్యాలయం, వారానికి లేక 15 రోజులకూ ఒకసారి ఆ దరఖాస్తులనన్నిటినీ పరిశీలించి తగినఏర్పాట్లను చేస్తుంది. దీనివలన చిన్నవర్తకులకు కూడా సౌకర్యం ఏర్పడగలదు."

## చాంగ్ కొత్తవ్యూహం

### చైనా ప్రభుత్వవర్గాల్లో నైరాశ్యం

### షాంగైనుండి విదేశస్థుల ఖాళీచేయుటకేర్పాట్లు

నాన్‌కింగు, నవంబరు 6: మంచూరియాతోపాటు తన అనుయాయుల ధైర్యవిశ్వాసములను కూడా కోల్పోవుచున్న జనరలిజో చాంకైషేక్ తన సైన్యములను యాంగ్‌ట్సీ నది దిగువన ఆయత్త పరచుకొని, కమ్యూనిస్టులు మధ్యచైనాలోనికి రాకుండా నిరోధింప నెంచుచున్నాడని రాయిటర్ వార్తలు తెలుపుచున్నవి.

నాన్‌కింగుకు ప్రమాదం ఎంత దగ్గరకు వచ్చినదంటే ఉత్తర చైనాను పూర్తిగా వదలివేసి, అక్కడి సేనలను కూడా యాంగ్‌ట్సీ నదీతీరానికే రప్పించుకొని తన రాజధానిని రక్షించుకోవలెనని చాంకైషేక్ ఆలోచించుచున్నాడట.

నాన్‌కింగుకు 110 మైళ్లు మాత్రమే ఉత్తరానఉన్న పెంగ్పూపై కమ్యూనిస్టులు దెబ్బతీయుట కూహించుచున్నారు. పెంగ్పూలో నిన్నటినుండీ మార్షల్ లా ప్రకటింపబడినది. మధ్య చైనాను రక్షించుట కక్కడ ఏకైక సైనికకేంద్రము నేర్పరుపవలెనని, ఇక్కడ యుద్ధం కొంత ముదరగానే స్వయముగా సేనానాయకత్వమును వహింపవలెనని చాంకైషేక్ ఆలోచించు చున్నాడు.

ఇప్పటికే కాళ్లు తెగివున్న జనరలిజో ప్రభుత్వమునకే యుద్ధంవలన వచ్చే లాభమేమీలేదని పరిశీలకు లంటున్నారు. పెంగ్పూలోఉన్న 4 లక్షలనుండి ప్రభుత్వ సేనానివహంలో ఒకటిరెండు పటాలములు మాత్రమే కొంచెం సమర్థంగా, ఆఖరి వరకూ పోరాడగలవట.

### యాంగ్‌ట్సీ పోరాటానికి సేనాధిపతి విముఖత

ఉత్తరచైనా సేనాధిపతి జనరల్ ఫుట్సోయీ నాన్‌కింగువచ్చి జరిపిన 2 రోజుల రహస్యచర్చలలో, యాంగ్‌ట్సీ నదీతీరాన పోరాటంజరుగుటకు వైముఖ్యం చూపినాడని, అవసరమైతే ప్రధాన ఉత్తర నగరాలైన పీపింగ్, టీంట్సిన్‌లను తాను పరిత్యజించి వాయవ్యరాష్ట్రాలైన సూయాన్, చహార్‌లలో నిలబడతానని చాంకైషేకు స్పష్టం చేసినాడని తెలియుచున్నది.

జనరల్ ఫుట్సోయీ తన స్థావరమైన పీపింగుకు తిరిగి వెళ్లగనే, చాంకైషేకు తన అభిప్రాయమును మార్చుకొని, ఉత్తర చైనాలో ఫుట్సోయీకి సర్వాధిపత్యమును ఇచ్చువచ్చినట్లు చేయు అధికారమునుఇచ్చి

(2-వ పేజీ చూడుడు)

## డా॥ స్టిక్కర్, డా॥ హట్టాల చర్చలు తిరిగి ప్రారంభం

బటేవియా, నవంబరు 6: ఇండొనీషియా సమస్యపై సంధి సంప్రదింపుల నిమిత్తం తాను తిరిగి రేపు రిపబ్లిక్ రాజధాని జోగ్జకర్తాకు వెళ్లుచున్నానని డచ్చి విదేశాంగమంత్రి డా॥ డి. యు. స్టిక్కర్ నేడు ప్రకటించెను. రిపబ్లిక్ ప్రధాని డా॥ హట్టాతో జరిపిన 2 రోజుల చర్చల అనంతరం అతడు బటేవియాకు తిరిగిరాగానే ఈప్రకటనచేసెను.

రేపు జరుపబోయే చర్చతో ఆఖరివనీ, రిపబ్లిక్‌తో పూర్వం ఆగిపోయిన సంప్రదింపులను తిరిగి ప్రారంభించుట ఉచితమో అనుచితమో డా॥ స్టిక్కర్ రేపటి చర్చల ఫలితములనుబట్టిడచ్చిప్రభుత్వమునకు సలహా యిచ్చునని విశ్వసనీయంగా తెలియుచున్న సంప్రదింపులుతిరిగి ప్రారంభమయ్యేసూచన లెక్కడాలేవని "అంతరా" ప్రకటించినది.

## పాలస్తీనా విషయంలో అమెరికా ప్రభుత్వశాఖ బెవిన్ ఆదేశాల్నే పాటిస్తున్నదని స్టీఫెన్ వైజ్ ప్రకటన

న్యూయార్కు, నవంబరు 5: అమెరికా స్టేట్ డిపార్టుమెంటు వారు (విదేశాంగశాఖ) ట్రూమన్ ఉత్తర్వుల కన్న ఎర్నెస్ట్ బెవిన్ సూచనలకే ఎక్కువ ప్రాధాన్య మిచ్చుచున్నారని, పాలస్తీనాపై మండలిలో ఇటీవల జరిగిన తీర్మానంవల్ల రుజువు అవుతున్నదని అమెరికా యూదుమహాసభ అధ్యక్షుడు డా॥ స్టీఫెన్‌వైజ్ నేడిక్కడ ఉద్ఘాటించెను.

మండలి కావించిన తీర్మానం పైకి దుర్బలంగా కనిపించినా, లోతుకు దిగిచూస్తే అది చాలా కఠినమైనదనీ, చాలా తీవ్రమైన ఆంక్షలను విధించడానికి తీర్మానం అవకాశం ఇచ్చుచున్నదనీ బోధపడగలదు అని వైజ్ చెప్పెను.

## సమితికి బంచ్ నివేదిక

పారిస్, నవంబరు 6: పాలస్తీనా పరిస్థితి గురించి ఆక్టింగు మధ్యవర్తి డా॥ రాల్ఫ్‌బంచ్ నేటిరాత్రిఐక్యరాజ్యసమితికి తన నివేదికను సమర్పించెను. ఇస్రాయిల్ సైన్యములు యుద్ధవిరమణో త్తర్వును పలుమారులు ఉల్లంఘించినదాని ఫలితముగా ఉత్తర పాలస్తీనాలో మిలిటరీ పరిస్థితి తీవ్రముగా మారిపోయిందనీ, ఇదివరకు గాలిలీలో ఫాజీఎల్ కాక్జీ ఆక్రమణక్రింద నున్న ప్రాంతమంతా యిప్పుడు యూదుల కైవశమైనదనీ డా॥ బంచ్ సమితికి తెలియజేసెను.

### చర్చకు వాయిదా

పారిస్, నవంబరు 6: గాలిలీ ప్రాంతపు పరిస్థితి వివరములు తాత్కాలిక మధ్యవర్తి, డా॥ రాల్ఫ్‌బంచ్‌కి చేరనికారణముగా నేడు భద్రతామండలిలో పాలస్తీనా చర్చ జరుగలేదు. గత వారాంతమున ఇస్రాయిలు సైన్యములు అరబ్బుసేనలను లెబనాన్ సరిహద్దుదాటితరిమి గాలిలీ ప్రాంతమంతయు ఆక్రమించెను.

### రహస్య ఆయుధ రవాణా

లండన్: నవంబరు 6: జెకోస్లొవేకియా ఇస్రాయిల్‌ల మధ్య జరుగుతున్న రహస్య ఆయుధ వ్యాపారం గురించి, తమకు తెలియవచ్చిన సమాచారమునంతను బ్రిటిషుప్రభుత్వం రాల్ఫ్ బంచ్‌కి అందజేసినదని, నేడిక్కడ అధికారరీత్యా వెల్లడించబడెను. అయితే బ్రిటిషు ప్రభుత్వం ఇంకా జెకోస్లొవేకియాకు అధిక్షేపణ పత్రం ఏదీ పంపలేదు. అమెరికా ఇదివరలో ఈ విషయమై పంపిన అధిక్షేపణ పత్రమును జెకోస్లొవేకియా నిరాకరించడం జరిగింది.



## అమెరికా సహాయం స్వీకరింపరాదని యూరప్‌రాజ్యాలకు మాలటావ్ హెచ్చరిక

### తమ దేశం దినదినాభివృద్ధి చెందుతున్నదని సోవియట్ విదేశాంగమంత్రి ప్రకటన

మాస్కో, నవంబరు 6: రష్యా విప్లవ వార్షికోత్సవ సందర్భములో బోల్షోయి థియేటరులో జరిగిన సమావేశములో ఒకటిన్నర గంటలకుపైగా ప్రసంగించి రష్యా విదేశాంగమంత్రి అనేక ముఖ్య జాతీయ, ప్రపంచ పరిస్థితులను సింహావలోకనము చేసెను.

కమ్యూనిజము నిర్మించుటలో సోవియటు ప్రజల విజయమున్నూ, సోవియటు యూనియను ఆర్థికబలమున్నూ, సోవియటు యూనియను ప్రజలమధ్య సఖ్యతయు పెరుగుచున్నదనియు; శాంతి ప్రజాస్వామికములకు రష్యా అధికమైన ప్రపంచఖ్యాతి గడించుచున్నదనిరి; 1947 నుంచీ అనేక రష్యను పరిశ్రమలు యుద్ధ పూర్వస్థితికివచ్చినవనియు: ఆహారోత్పత్తి యుద్ధ పూర్వస్థితికన్న హెచ్చినదనియు; కిందటి ఏడు జరిగిన ఆర్థిక సంస్కరణల మూలముగానూ, ధరల తగ్గుదలవలనను శ్రామికుల కొనుగోలుశక్తి హెచ్చెనదని వెల్లడించిరి. రష్యాలో దోపిడి విధానము ప్రజాస్వామిక పద్ధతులపై అమలు జరుగలేదని విమర్శలు వచ్చినప్పటికినీ సోవియటు యూనియనులో ప్రజలు సఖ్యములోనుంది, అజేయమైన సైన్యములను కలిగియున్నారని మోలటోవ్ చెప్పెను.

అంతర్జాతీయ పరిస్థితులను గురించి ఆయన ఈ కింది వ్యాఖ్యానములు చేసెను:



రెండవ ప్రపంచ యుద్ధానంతరము పోలండు, రుమేనియా, బల్గేరియా, ఆల్బేనియా, యుగోస్లావియా, హంగేరీ దేశాలు పెట్టుబడిదారీ విధానమును విడిచిపెట్టినవి. వలస దేశములలో స్వాతంత్ర్యోద్యమము పెరుగుచున్నది. అమెరికాలో ఉత్పత్తి యుద్ధ పూర్వస్థితికి ఇంకారాలేదు. అమెరికను శ్రామికుల వేతనములు ధరలకు వెనుకబడి ఉండుటచే వారి జీవితపరిమాణము తగ్గినది. అమెరికాలో నిరుద్యోగుల సంఖ్య 20 లక్షలనుచున్నారుగాని దీనికి మూడింతలున్నది. యూరపుదేశములు అమెరికా సహాయముపై ఆధారపడియున్నవి. కాని, అమెరికావారి ఉద్దేశము తమ సరకులను అమ్మకొనుటే కావున అమెరికా సహాయమువలన యూరపు దేశాల పరిశ్రమలు అభివృద్ధి చెందబోవు. యుద్ధమునకు కాలుదువ్వు అమెరికను పెట్టుబడిదారులను బలపరచుట యూరపుకు క్షేమకరముకాదు.

(2-వ పేజీ చూడుడు)

## విదేశాలతో ఇండియా వ్యాపారం

### ఎగుమతి సుంకాల తగ్గింపు

న్యూఢిల్లీ, నవంబర్ 6: మనదేశం నుంచి ఎగుమతులు ఎక్కువయేట్లు ప్రోత్సహించటానికై భారతప్రభుత్వం, లోగడ సూచించబడినట్లుగా, కొన్ని వస్తువుల ఎగుమతులమీద సుంకాలను అసలే తొలగించుటకూ, మరికొన్నిటిపై ఎగుమతి సుంకాలను తగ్గించుటకూ ఆలోచిస్తున్నది. ఈ విషయమై త్వరలోనే ఒక నిర్ణయం చేయబడును.

ఇండియా, బెల్జియముల మధ్య వాణిజ్యావకాశాలను పరిశీలించి వీలయితే ఒక వాణిజ్య ఒడంబడిక చేసుకొనే ఉద్దేశంతో నవంబర్ 20 వ తేదీన 20 మంది సభ్యులతో బెల్జియం వాణిజ్య సంఘమొకటి ఇండియాకు బయలుదేరుతున్నది. ఇండియా తనకు జనపనార, సంచులు, మాంగనీసు, తేయాకు, తోళ్లు, సప్లయిచేస్తే, తాను ఇండియాకు ఇనుము, ఉక్కు యంత్రసామగ్రులను సప్లయి చేసెదనని బెల్జియం ప్రతిపాదించ గలదని తెలుస్తున్నది.

## కేంద్రమంత్రివర్గంలో త్వరలో ప్రధానమార్పులు జరిగే సూచన

### రాజేంద్రబాబుకు తిరిగి స్థానం: అనేకమంది ఉపమంత్రుల నియామకం

ఢిల్లీ, నవంబరు 6: దాదాపు ఒక నెలరోజులు పాటు దేశాన్ని విడిచిఉండి, ఈ వేళనే ప్రధాని పండిత నెహ్రూ స్వదేశానికి వచ్చెను. తనమంత్రివర్గాన్ని సంస్కరించే విషయాన్ని గురించే ఈయన మొదట సంప్రదింపులు జరపవలసి ఉంటుందని తెలుస్తున్నది. విదేశాంగశాఖను తన సహచరుల్లో ఒకరికి అప్పగించి తాను అచ్చగా వివిధశాఖల సమన్వయంలోనూ, పరిపాలనా నిర్వహణంలోనూ పూర్తిగా నిమగ్నుడు కాగలడని కొంతకాలం నుంచి వదంతులు వ్యాప్తిలో ఉన్నవి. సహాయప్రధాని సర్దార్ పటేలుకు ఆరోగ్యం సరిగా లేనందువల్ల, ప్రచారశాఖ మొదలైన వాటిని ఆయన వదులుకోవచ్చునని కూడా తెలుస్తున్నది. కాంగ్రెసు గద్దెను వచ్చే నెలలో డాక్టరు పట్టాభికి అప్పగించిన మీదట రాజేంద్ర ప్రసాద్ కూడా తిరిగి కేంద్ర ప్రభుత్వంలో చేరే అవకాశం వున్నదని కూడా తెలుస్తున్నది.

కేంద్ర ప్రభుత్వంలో డిప్యూటీ మంత్రులను, స్టేట్ మంత్రులను కూడా నియమించవచ్చునని అభిజ్ఞవర్గాలు భావిస్తున్నారు.

## అట్లాంటిక్ ఒడంబడిక సమావేశం

ఒట్టావా, నవంబరు 6: అట్లాంటిక్కు రక్షణ ఒడంబడిక వివరాలను చర్చించుటకు వాషింగ్టన్‌లో సప్తరాజ్య ప్రతినిధుల సమావేశం జరుగుతుందని కెనడా ఆక్టింగు విదేశాంగ మంత్రి బ్రూక్ క్లాక్స్టన్ నేడిక్కడ ప్రకటించెను.

## గోవాను కొనుటకు నిజాం నవాబు చేసిన ప్రయత్నాలు

### ఇండియా ఏజెంటు జనరల్ మున్షీ వివరణ

బొంబాయి, నవంబరు 7: హైదరాబాద్‌లోని ఇండియా ఏజెంటు జనరల్ కె. ఎం. మున్షీ గారు నిన్న సాయంకాలం తన గౌరవార్థం మహాగుజరాత్ సమ్మేళనం వారు ఏర్పాటుచేసిన సన్మాన సభలో ప్రసంగించుచు యిట్లనెను.

"నేను హైదరాబాద్ చేరిన ప్రథమంలో, సంస్థానంలోని వాస్తవ పరిస్థితులను నన్ను తెలుసుకొననివ్వకుండా చేయవలెనని, లాయక్‌అలీ మంత్రివర్గం శాయశక్తులా ప్రయత్నించినది. అయినప్పటికీ సంస్థానంలోని పరిస్థితులను గురించి స్వయంగా తెలిసికొనదలచినాను. రజాకార్లను గురించి, వారి దౌర్జన్య చర్యలను గురించి నేను అనేక విషయములను విన్నాను. వాటినిబట్టి హిందువులలో భీతిని రేకెత్తించుటలో రజాకార్లు సంపూర్ణంగా కృతకృత్యులైనారనియే చెప్పవలెను. ఎందుచేతనంటే హైదరాబాద్‌నుండి 200 మైళ్ల దూరంలోనున్న విజయవాడకు నేను వెళ్ళినప్పుడు దారిలో నాకు ఒక్క హిందువుకూడ కనుపించలేదు.

ఎవ్వరితోనూ నన్ను కలవనివ్వకుండా చేయవలెనన్న లాయక్‌అలీ మంత్రివర్గ ప్రయత్నంకూడా సంపూర్ణంగా నెరవేరినది. అప్పుడు నేను విదేశీయులను, సంస్థాన వాస్తవ్యులలో నిష్పాక్షికమైన వారుగా నుండి, నావద్దకు వచ్చుటకు వీలున్న వారిని ఆహ్వానించుట ప్రారంభించి వారిద్వారా నిజాంనవాబు వ్యవహారాలను గురించి, రజాకార్ల చర్యలనుగురించి అమూల్యమైన విషయములను సేకరించినాను. గోవాను కొనుగోలుచేయు విషయమై పోర్చుగీసు ప్రభుత్వంతో సంప్రదింపులు జరుపుటకు నిజాం నవాబు ఆతురతతో నున్నాడని వీరి ద్వారానే నేను మొదట తెలుసుకొన్నాను. ఇందుకుగాను నిజాం నవాబు 10 వేల పౌండ్ల ధనమును ముందుగా యిచ్చినాడనికూడ వీరిద్వారానే తెలుసుకొన్నాను. ఈ మొత్తం రసీదు ప్రతిని కూడ నేను సంపాదించినాను. ఈవిషయాలన్నిటిలోను నేను కృతకృత్యుడనగుటకు కారణం, సర్దార్ వల్లభాయ్ పటేల్ గారికి నాలో పరిపూర్ణమైన విశ్వాసం ఉండుట వలననే."

భాషారాష్ట్ర విషయమును గురించి మాట్లాడుచు, తానుకూడ యీ సంఘంలో ప్రాంతీయ సభ్యుడు కాబట్టి, ప్రస్తుతాని కేమీ చెప్పలేనని చెప్పెను.

హైదరాబాద్‌లో ఉన్నకాలంలో మున్షీ గారు నిర్వర్తించిన కార్యభారమును ప్రశంసించుచు ప్రథమంలో పురుషోత్తమ దాస్ ఠాకూర్ దాస్, తదితరులు ప్రసంగించిరి.

వాషింగుటన్, నవంబరు 6: అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ నేడు మిలిటరీ సలహాదారులతో సమావేశం జరిపి దేశముయొక్క మిలిటరీ పరిస్థితి ఎలా ఉన్నదీ సమీక్ష చేశాడు.

## చైనాకు విరివిగా సాయం చేయడానికి జార్జి మార్షల్ నిర్ణయం

నాంకింగ్, నవంబరు 6: అమెరికా విదేశాంగమంత్రి జార్జిమార్షల్ చైనా విషయమై తన పూర్వ వైఖరిని పూర్తిగా మార్చుకున్నాడనీ, కమ్యూనిస్టుల దురాక్రమణనుండి చైనాను రక్షించుటకై అమెరికా తన సర్వశక్తులూ ధారపోయవలెనని మార్షల్ ఇప్పుడు కృత నిశ్చయుడై ఉన్నాడనీ, ఒక ఉన్నతాధికారిద్వారా తెలియవచ్చినది.

చైనా విదేశాంగమంత్రి వాంగ్ షిఛియే ఇటీవల పారిస్‌కు వచ్చినప్పుడు మార్షల్ ఆయనను కలుసుకొని చైనాకు సహాయం చేయడం విషయమై తన వైఖరిని మార్చుకున్నానని ఆయనకు స్వయంగా తెలియజేసెను. వాంగ్ షిఛియే, తనకూ మార్షల్‌కు నడిచిన సంభాషణను చాంగ్ కై షేక్‌కు నివేదించెను. అప్పుడు చాంగ్ కై షేక్

2 వ పేజీ చూడుడు

# మొలటావ్ హెచ్చరిక

(1-వ పేజీ తరువాయి)

ఫ్రాన్సులో కార్మిక వేతనములు యుద్ధ పూర్వస్థితికి సగము దిగజారినవి. ఈ సంవత్సరము పూర్వార్థములో ఫ్రెంచి పెట్టుబడిదార్ల లాభములు దేశీయ ఆదాయములో నూటికి 43 వంతులుండె, దేశములోని జీతగాండ్రందరి వేతనముల మొత్తమును మించియున్నవి. స్టాలిను చెప్పినట్లు యుద్ధము గెలుచుట శాంతి సంపాదించుట కాదు. ఎప్పటికీ కాకపోయిన, చిరకాలము యుద్ధము కలుగకుండునట్లు చూడవలెను.

రష్యను ప్రజల రక్తము ధారపోసి సాధించిన యాల్టా, పోట్స్‌డామ్ షరతులు అమలుజరుగవలెనని రష్యా పట్టుదల కలిగియున్నది. షరతులన్నియు నీటిబ్రాలయినవని చెప్పరాదు. ఎన్ని అవాంతరములు కలిగినను ఐక్యరాజ్యసమితి పని సాగించుచునే యున్నది. తామాక్రమించిన జర్మనీభాగములలో అమెరికా, బ్రిటను, ఫ్రాన్సులవారు మాజీ నాజీ నాయకులను యథాస్థానములలో ప్రతిష్ఠించుచున్నారు. దీనికి రష్యా సమ్మతించదు. జపానుతోటి సంధిషరతులింకను విపులీకరింపబడనేలేదు. ఈ రెండు దేశములనూ నిరాయుధపరచి ప్రజాస్వామికము నరించవలెను. జపాను యుద్ధపరిశ్రమలను నిర్మూలము కావలెను. ఈ దేశముల సాధారణ పరిశ్రమలను నాశనము చేయరాదు. జర్మనీ జపానులలో ఆక్రమణ అంతులేక సాగించగోరువారే అట్టిపని చేయుదురు.

ఆయుధ సంక్షేపమును గురించి సర్వప్రతినిధి సభ చేసిన తీర్మానములో యుద్ధప్రేరకుల ప్రమేయమంతయు "కడిగివేయ" బడినది; కాని తీర్మానము ఉన్నమాట నిజము. అణువు అస్త్రములు నిర్మూలించవలెనను రష్యాసూచనను అనేక దేశములలోని విశేషప్రజలు బలపరుచుచున్నారు. కాని సర్వప్రతినిధిసభలో ఈభావము కనపడుటలేదు. ఈ విషయములో ప్రపంచములోని శాంతికాముకులందరినీ మించి రష్యా అగ్రస్థానమున నిలబడును. యుద్ధకాలములోవలెనే, యుద్ధానంతరమునూ, చేయబడిన నిర్ణయములు అన్ని పక్షములవారును ఒకేసారి అమలు జరుపవలెనని రష్యా కోరుచున్నది. రష్యా విదేశాంగ వైఖరిలో ఎట్టిమార్పుగాని కలిగినదని ఎవరును చెప్పలేరు. అయితే యుద్ధభయము తీరిపోగానే అమెరికా బ్రిటనుల వైఖరి పూర్తిగా మారిపోయి, రష్యను చులకన చేయుచున్నారు. పైకి అనకపోయినను, ప్రపంచమును ఏలుటకు అడ్డంకులు తొలగిపోయినవని వారు భావించుచున్నారు. కొర్జన్యము నూ యుద్ధప్రేరణనూ రష్యా సహించదు. కనుకనే బెర్లినుసమస్య కలిగినది. రష్యాతో ఏకీభవించినచో యుద్ధప్రేరకుల ఆటలు సాగవు. కనుక వారు రష్యాతో ఏకీభవించుటకు భయపడుచున్నారు.

ప్రపంచమంతటా ఆ మెరికా కు సావరము లెందుకు? ఈయేడు అమెరికా యుద్ధ ఖర్చు యుద్ధకాలపు ఖర్చులో సరిసమానముగానూ, యుద్ధపూర్వపు ఖర్చుకు పదకొండు రెట్లును. ఉండుటకు కారణమేమి? పశ్చిమ యూరపు అట్లాంటిక్, మెడిటరేనియను సమాఖ్యల ఆందోళనలకు కారణమేమి? వాని నెదిరించుచున్న దెవరు? శాంతిశక్తులు చర్చిల్ బృందమును కూలద్రోయగలిగినవి. దాని శక్తి గొప్పది. ప్రజలు వెనుకటివలె సోవియటు వ్యతిరేక ప్రచారమును స్వీకరించరు. కనుకనే అమెరికా ఎన్నికలలో డ్యూయీ ఓడిపోవుట జరిగెను. యుద్ధోన్మాదముతో కూడిన డ్యూయీ కార్యక్రమమును అమెరికను ప్రజలు బలపరచలేదు. జాతీయపక్షము వారు యుగోస్లావియా ప్రజలకు అపకారము చేసిరి. కాని ఆ ప్రజలను యుగోస్లావుపక్షమువారు శాంతిసుముఖులుగా చేసి తీరుదురు. రష్యా ఆత్మరక్షణవైఖరిని అవలంబించుచున్నది. ఆ వైఖరి ఇతర ప్రభావములకు లొంగుటలేదు.

# మార్షల్ నిర్ణయం

1 వ పేజి తరువాయి

వాంగ్ షి-చిధోను రాజీనామా ఇవ్వవద్దని ప్రతిమాలెడెనని, రష్యన్ ఎలుగుగొడ్డును మంచిమాటలతో మచ్చిక చేసుకోవడం సాధ్యంకాదని తనకు ఇంతకాలానికి గాని తెలిసిరాలేదని చాంగ్ కై షేక్ పశ్చాత్తాపము వెలిబుచ్చెననీ, తెలియుచున్నది. 1945 వ సంవత్సరము మైత్రీ ఒడంబడికను రష్యా పలుమార్లు ఉల్లంఘించినా చైనా ఇంతవరకు రష్యాను అతిక్రమణకారిగా గర్హించలేదు. రష్యాను గర్హిస్తూ తీర్మానం చేయవలసిందని చైనా శాసనసభ్యులు అనేకమంది, ఈ ఉదంతం విన్నతర్వాత, పట్టుపడుతున్నారు. చైనాజాతీయ ప్రభుత్వముదోచి రష్యా కాత్రమును ప్రదర్శించుచున్నారని ఐక్యరాజ్యసమితికి ఫిర్యాదు చేయవలెననికూడా వీరు కోరుతున్నారు. ఈ ప్రతిపాదనలన్నిటిని పొందుపరచుచూ ఒకబిల్లు తయారుచేయబడుతున్నదని తెలియవచ్చినది. శాసనసభ విదేశాంగ వ్యవహార

సంఘం ఇటీవల సమావేశం అయినప్పుడు పలువురుసభ్యులు రష్యాను నిశితంగా విమర్శించిరనీ, చైనా పాశ్చాత్య రాజ్యాలతో ఇప్పటికన్న ఎక్కువ సన్నిహితంగా మెలగవలెనని ప్రభుత్వమునకు విజ్ఞప్తిచేసిరనీ, వినవచ్చినది. దూరప్రాచ్యంలో ఒక కమ్యూనిస్టు ప్రతికూల రాజ్యకూటమిని స్థాపించవలెనని కూడా వారు ప్రతిపాదన చేసిరి.

జాస్తిమార్షల్ మనస్సు మార్చుకొన్నా విన్నవార్త చైనాలో అనేకమందికి ఉత్సాహజనకమైనది, మంచూరియా ఓటమికి రష్యాను నిందిస్తూ, మంచూరియా శాసన సభ్యులు ఒక తీర్మానమును కావించిరి.

# ప్రాంతీయ రక్షాదళముల విధులు

## సర్దార్ పటేల్ వివరణ

లక్నో, నవంబరు 5: భారతప్రభుత్వ ఉపప్రధాని సర్దార్ పటేల్‌గారు నేడు ప్రభుత్వభవన ఆవరణలో ప్రాంతీయ రక్షాదళ సమావేశమునందుపన్యసించుచు యిట్లు చెప్పిరి:" ప్రయివేటుసేనల నిర్మాణమును భారతప్రభుత్వమువారు యెంతమాత్రము అంగీకరింపరు. ఐనప్పటికి అంతరంగిక భద్రతకును, అవసరమైనప్పుడు ప్రజలకు రక్షణ యొసంగుటకును రాష్ట్రీయప్రభుత్వములు వాలంటీరుదళముల నేర్పరుచుటకు అనుమతించిరి. వెలుపలి ఉపద్రవమునుండి రాష్ట్రమును రక్షించుటకు ఐచ్ఛికభటబృందము లవసరములేదు. ఎందుకనగా, యిట్టి ఉపద్రవ మేమియులేదు. అనగా అట్టి ఉపద్రవమేమైనా యున్న యెడల దాని నెదుర్కొనుట కర్తవ్యము సైనికులది. వరదలు, కరువులు, రోగములు, లేదా ఏమైనా అల్లరులు జరిగినప్పుడు ప్రజలకు సహాయము చేయుట రక్షణ యొసంగుట ప్రాంతీయరక్షాదళము వంటి ఐచ్ఛికభటదళముల ప్రధాన కర్తవ్యమైయున్నది. దేశములో శాంతి, సమరస భావము వుండునట్లు చూచుట పౌరుల మధ్య సుహృద్భావమును పెంపొందించుట ఈ ప్రాంతీయ రక్షాదళముల విధియై యున్నది. తమ విధిని వారు బాగుగా నిర్వర్తించినయెడల పోలీసుల ఉపయోగము తగ్గును. ప్రజలకు విశ్వాసము కలిగించువిధమున, ప్రజలు మిమ్ము నిజమయిన రక్షకులుగా తలచువిధమున ప్రవర్తింపుడు."

(యు. ప్రె.)

## అభినందన గ్రంధం

లక్నో, నవంబరు 6: రాజకీయ రంగంలోనూ, హిందీ సాహిత్యరంగంలోనూ పనిచేసిన ప్రముఖులు కొందరు సర్దార్ పటేలుపై వ్రాసిన ప్రశంసావ్యాసములను, జీవితానుభవ వ్యాసములను సంపుటీకరించి "అభినందన గ్రంథ్" అనే పేరుతో ఆయన నవంబరు 28 న అలహాబాదు వచ్చినప్పుడు బహూకరింపనున్నారు. ఈ గ్రంథమునకు బాబూ పురుషోత్తందాస్ టాండన్ పీఠిక వ్రాస్తున్నారు.

# రాయలసీమ మహాజన సభసమావేశ ప్రారంభం

అనంతపురం, నవంబరు 7: రాయలసీమ మహాజనసభ సమావేశం నేటి ఉదయం ప్రారంభమైనది. రాయలసీమలోని ఐదుజిల్లాలనుండి వందలకొలది ప్రతినిధులు వచ్చిరి. ఉదయం ప్రభాత భేరి అనంతరం రాష్ట్రకాంగ్రెస్ ఉపాధ్యక్షులు శ్రీ పి. తిమ్మారెడ్డిగారు జాతీయ పతాకోత్సవం జరుపుచు, నెహ్రూ నాయకత్వమును ప్రశంసించిరి. కిసాన్ కూలీ ప్రజా రాజ్యమును స్థాపించుటకు గాను విద్యార్థులు, కిసాన్లు, కూలీలు, మిగిలిన వారు పెట్టుబడిదారీ వర్గములకు, మేధావంతులకు ఎదురెత్తుగా ఐక్య మవవలసిందని తిమ్మారెడ్డిగారు విజ్ఞప్తి చేసిరి. ఈ మహాసభ జరుగకుండా చేయవలెనని జరుపబడిన ఆందోళనను తీవ్రముగా ఖండించిరి.

# మద్రాసులో ముసురు

చెన్నపట్నం, నవంబరు 7: నగరంలో వర్షాకాలం ప్రారంభమైంది. మొన్నరాత్రి పెద్దవానపడింది. నిన్న ఉదయం కొంత తెరపిచ్చినా సాయంత్రం మళ్లీ ప్రారంభమైంది. రాత్రి కొద్దిపాటి చినుకులు పడితూనే ఉన్నది. ఇవాళ ఉదయం తిరిగి ప్రారంభమైంది. ఒంటి గంటవరకూ జడివాన కురిసింది. ఈ 3 గంటల్లోనూ అరమం 3 దుక్కుల వానపడింది. 2 గంటల వరకూ చినుకులు పడుతునే ఉన్నవి.

## టెనెసీలోయ ప్రాజెక్టు

వాషింగ్టన్, నవంబరు 4: అమెరికాలోని టెనెసీలోయ ప్రాజెక్టు ప్రపంచములోకల్లా పెద్దది. అది సాగుబడినీటినీ విద్యుచ్ఛక్తినీ ఇచ్చుచున్నది. అదే పద్ధతిపై అంతకంటె చిన్నవైన ప్రాజెక్టులు ఇండియాలో అనేకము తయారు కానున్నవి, కనుక దాని వివరములు తెలిసికొనుటకు గాను అమెరికాలోని ఇండియా రాయబారి సర్ బెనెగల్ రామారావు దానిని సందర్శించును.

# భారత లలితకళల పునరుద్ధరణ

## అజాద్, నెహ్రూ, రాజగోపాలాచారిగార్ల ఉద్బోధ: ఢిల్లీలో ప్రదర్శన ప్రారంభం

న్యూఢిల్లీ, నవంబరు 6: నేటి సాయంకాలము ఇచ్చట భారతీయ శిల్పప్రదర్శనము ఆరంభమయ్యెను. దానికి గవర్నరు జనరలు రాజగోపాలాచారి ప్రారంభోత్సవము జరిపెను. ప్రదర్శనమునకు అధ్యక్షత వహించిన మౌలానా అబుల్ కలామ్ అజాద్ ఈ ప్రదర్శనముయొక్క పూర్వోత్తరముల నీ క్రిందివిధముగా వివరించెను:

ఇంగ్లండులోని రాయల్ ఎకాడమీ వారు ప్రాచ్యశిల్ప ప్రదర్శనములను కొన్నిటిని నడిపిరి. 1931 లో ఇరాను శిల్పప్రదర్శనము, 1935 లో చైనా శిల్పప్రదర్శనము జరిగెను. వారు భారతీయ శిల్పప్రదర్శనము కూడ జరుపగోరి, భారత ప్రభుత్వము అనుమతితో, భారత శిల్పములను ఏరుట కొక సంఘమును నియమించిరి. శ్రీమతి సరోజినీదేవి దాని కధ్యక్షత వహించెను. ఇంగ్లండునుండి ముగ్గురు శిల్పప్రవీణులు ఇండియాకు వచ్చిరి. ప్రదర్శనార్హములైన శిల్పములు కొన్ని రాష్ట్ర ప్రభుత్వముల ఆధీనములోనూ, మరికొన్ని సంస్థానములలోనూ, వ్యక్తులవద్దను కూడ ఉండెను. పైనచెప్పిన సంఘమువారు ఇండియా అంతటా పర్యటించి, చారిత్రకదృష్టిలోనూ కళాదృష్టిలోనూ ప్రదర్శనయోగ్యములుగా భావించబడిన శిల్పములను వెయ్యింటిని సేకరించిరి. వీటి ప్రదర్శనము లండనులో 1947 డిసెంబరు నుండి 1948 ఫిబ్రవరి వరకును జరిగెను. శిల్పములు ఇండియాకు తిప్పి పంపబడినవి. ఇట్టి అమూల్యరచనల సముదాయము అన్నప్పుడల్లా దొరకదు. కనుక వీటిని భారతదేశములో కూడా ప్రదర్శించవలెనని భారత ప్రభుత్వ విద్యాశాఖవారు భావించిరి. భారతీయ శిల్పసంపద అంతయు వీనిలో నున్నది. వీనిద్వారా భారత దేశచరిత్ర అంతయు తెలియవచ్చును. స్వతంత్రభారతమున కీ ప్రదర్శనము మిక్కిలి ఉపయోగకరము. ఈ శిల్పములలో రాతివిగ్రహములూ, కంచువిగ్రహములూ, రంగుచిత్రములూ, వస్త్రములు తదితరములూ కలవు. క్రీస్తుపూర్వము 30 శతాబ్దులను, క్రీస్తుకు పరము 19 శతాబ్దులను ఈ శిల్పములలో ప్రతిఫలితములగుచున్నవి.

జాతీయ విద్యావిధానములో కళలకుగల ప్రాముఖ్యమును గురించి వివరించుచు, మన దేశములోని విద్యావిధానములో శిల్పసౌందర్యములు లోపించినవనియు, మాధ్యమిక (సెకండరీ) ఉన్నత విద్యలలో కళలకు స్థానమిచ్చుటకు విద్యాశాఖ ప్రయత్నించుచున్నదనియు, దానికి ఈ ప్రదర్శనము తొలిమెట్టనియు మౌలానా ఆజాద్ చెప్పెను.

## రాజగోపాలాచారి ప్రసంగం

ప్రదర్శనమును ప్రారంభించుచు గవర్నరుజనరలు రాజగోపాలాచారి ఇట్లు చెప్పెను:

జీవితములోని ఘనతయే కళలలో ప్రతిఫలించును. ప్రేమ భక్తి శ్రద్ధలు లేక కళ పుట్టదు. అట్టి ప్రేరణలతో పుట్టిన శిల్పములనే మనము నేటికిని ఆరాధించుచున్నాము. వానిని కోల్పోయిన మనము ఉన్నత శిల్పములెట్లు సృష్టించగలము? పరిమాణ ప్రమాణములు, రంగుల సంపాదనమూ, చిత్రణయథార్థతా ఉన్నంతమాత్రమున ఉత్కృష్టశిల్పము పుట్టదు. మనలో ప్రేమ భక్తి శ్రద్ధ లావిర్భవించవలెను. రాజకీయ విముక్తితో మనము పరివర్తనకు చక్కని అవకాశము కలిగినది. సద్బుద్ధితో ప్రయత్నించిన మనకు ఉత్తమ శిల్పముల వశమగును. ప్రజలు కళలపట్ల సమాదరణ చూపవలెను. ఈ ప్రదర్శనము మనకు చరిత్రతోపాటు కళనుకూడా నేర్పగలదు.

## పండిత నెహ్రూ

ఈ శిల్ప ప్రదర్శనమునుగురించి నేటి రాత్రి ఆలిండియా రేడియోకు ఒక ప్రసంగము రికార్డుచేయుచు భారత ప్రధాని నెహ్రూ ఈ క్రింది భావములను ప్రకటించెను:

జాతియొక్క నిజమైన ఘనత రాజకీయ చతురతలలోనూ, ఆయుధబలములోనూ కాక కళాసృష్టిలోనే సమగ్రముగా విస్పష్టమగును. జాతియొక్క జవసత్వములు కళారచనలోనే కాక జీవితవిధానములో కూడా వ్యక్తమగును. తమలో ఘనత ఉన్నంతకాలము ప్రజలు కళాసృష్టిచేసి అది ఉడిగిపోగానే గతమును నకిలీగా అనుకరించ నారంభింతురు. భారత చరిత్రయే దీనికి తార్కాణము. మన పూర్వపు ఔన్నత్యమును ఈ ప్రదర్శనమునందలి శిల్పములే రుజువుచేయుచున్నవి. మన పురాతన సాహిత్యమునకూడ ఇట్టి ఘనతయే ఉండినది. కాని ఆ ఘనత అంతయు అకస్మికముగా పట్టిపోయెను. కాని మనలో

ఇంకను జీవమున్నది. యిట్టి ప్రదర్శనముల ద్వారా దానిని పెంపొందించవలెను. సౌందర్యగ్రహణము, సౌందర్యారాధన మన దేశములో అడుగంటినవి. దీనిలోపము మన జీవితములో వ్యక్తమగుచున్నది.

నవంబరు 7 నుండి డిసెంబరు 31 వరకును ప్రదర్శనమును ప్రజలు చూడవచ్చును. ఇది గవర్నరుజనరలు అనుమతితో ప్రభుత్వభవనమున ఏర్పాటు చేయబడెను.

# కాశ్మీరులో భారతపతాక సర్వత్రా ఎగురును

## షేక్ అబ్దుల్లా విశ్వాసము

శ్రీనగర్, నవంబరు 6: 'భారతదేశము అన్ని మతములవారిని సమానముగా చూచు రాజ్యము. కాశ్మీరు సంస్థానముకూడ నిట్టిదియే. 15 వేల అడుగులఎత్తునవున్న రక్షణస్థావరములపై మీరు భారతపతాకను ప్రతిష్ఠించి యుండుటచేత నది సర్వత్ర ఎగురునని నిస్సంశయముగా ఋజువగుచున్నది.' అని నిన్న యూరీలో భారతసైనికులనుద్దేశించి యుపన్యసించుచు కాశ్మీరు ప్రధాని షేక్ అబ్దుల్లాగారు ప్రకటించిరి. ఈ సభలో మద్రాసు ఆర్థికశాఖమంత్రి శ్రీ బి. గోపాలరెడ్డిగారుకూడ ఉపన్యసించిరి.

షేక్ అబ్దుల్లా యూరీకివచ్చుట కిదియే ప్రథమ మగుటచేత పట్టణము ఉత్సవశోభ వహించియుండెను. హర్ష నినాదములతో ఘనఘోషణలు బ్రద్దలగు కరతాళధ్వనులతో పట్టణప్రజలు కాశ్మీర్ కేసరిని ఆహ్వానించిరి.

ఈ యుద్ధము క్రొత్త భూభాగమును తను దేశములో కలుపుకొనుటకు జరుగుచున్నది కాదని, తమ హక్కులను, సిద్ధాంతములను నిల్పబెట్టుకొనుటకై జరుగుచున్నదని షేక్ అబ్దుల్లాగారు చెప్పుచు యిట్లనిరి: "ప్రేమకును ద్వేషభావమునకును, సత్యమునకును అసత్యమునకును జరుగుచున్న యుద్ధమిది. పాకిస్తానీ దుండగీండ్రు యేమి చేసినప్పటికి ఆఖరు వరకు మేము ఈ యుద్ధమును సాగించెదము. ఈ సంస్థానములో పంచమవంతి వారికి స్థానములేదు. పాకిస్తానీ దుండగీండ్రు యిచ్చట ఇస్లాం మతవిరుద్ధములగు కార్యములు చేయుచున్నారు. డోగ్రా నిరంకుశత్వము నుండి ముస్లిములను రక్షించుటకై తామిచ్చటికి వచ్చిరని ప్రకటించుచు మన గ్రామములను వారు కొల్లగొట్టుచున్నారు. నాశనము చేయుచున్నారు. మన ప్రజలపై యితర ఘోర అత్యాచారములు గావించుచున్నారు. కాశ్మీరు ప్రజల ప్రార్థనపై భారత సైనికు లిచ్చటికివచ్చిరి. దుర్భరమైన చలిలోను అకసము నొరయు పర్వతముల మీదను పోరాడి వారు మన యిండ్లను వాకిండ్లను రక్షించుచున్నారు."

మద్రాసు ఆర్థికశాఖమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు సైనికుల నుద్దేశించి యిట్లు చెప్పిరి:—

"కాశ్మీరు ప్రజలు భారతదేశముతో కలయ నిశ్చయించుకొనియున్నారు. ఈ సంస్థానములో పాకిస్తానుకు యెట్టిహక్కులేదు. భారత ప్రభుత్వము భారత ప్రజలు మిమ్ములను జూచి గర్వపడుచున్నారు. ఈ యుద్ధమంత కష్టమైన యుద్ధము యిదివరలో ప్రపంచమునందెచ్చటను జరిగియుండలేదు. ఇంతవరకు మీరు సాధించిన పని మహత్తరమైనది. మీ ఉద్యమము న్యాయమైనది, ధర్మమైనది యగుటచేత మీకు విజయము కలుగునను నిశ్చయము." యు. ప్రె.

# అంతర్జాతీయ సహకారోత్సవము

చెన్నపురి, నవంబరు 7: సహకారశాఖామంత్రి కల్లూరి చంద్రమౌళిగారి అధ్యక్షతను నిన్న సాయంత్రం రాష్ట్రీయ సహకారబ్యాంకు భవనమున 26 వ అంతర్జాతీయ సహకారోత్సవం జరిగెను. వా. దేవు వియ్యన్నగారు స్వాగతి మొసంగిరి. సహకారవాదుల గౌరవార్థం అల్పాహార విందుచేసిరి. టి. ఎ. రామలింగం చెట్టిగారు ప్రస్తుతం రిజిస్ట్రారు సర్వాధికారిగా ఉన్నాడనియు అతని అధికారము పరిమితమొనర్చి అనధికారులకు స్వేచ్ఛ ఇచ్చిన గాని ఉద్యమము విస్తృతముగాదని తమ సందేశములో తెలిపిరి. కె. సి. రామకృష్ణన్‌గారు ప్రపంచ సహకారవాదులంతా ఏకోన్ముఖంగా కృషి చెయ్యవలెనను తీర్మానమును ప్రతిపాదించిరి. కె. సుబ్రహ్మణ్యం, ప్రొ॥ జనెష్య, డా॥ నరేశన్‌గారలు తీర్మానమును బలపరచుచు ప్రసంగించిరి. సహకార ఉద్యమ ప్రశస్తిని తెలుపు చిత్రపట ప్రదర్శనతో సభ ముగిసెను. [మంత్రిగారి అధ్యక్షోపన్యాసము నవంబరు 7 వ తేదీన ఆంధ్రపత్రిక ప్రకటించినది.]

# భారత ప్రభుత్వంపై మోయిన్ నవాజ్ జంగ్ ఆరోపణ

## భద్రతా సంఘాధ్యక్షునకు లేఖ

ప్యారిస్, నవంబరు 6: ఇదివరలో హైదరాబాదు విదేశాంగ మంత్రిగా నుండిన నవాబ్ మోయిన్ నవాజ్ జంగ్ భద్రతాసంఘ అధ్యక్షునకు లేఖవ్రాయుచు యిట్లు చెప్పుచున్నాడు:—

"హైదరాబాదు సమస్యను విచారించుటకు సెప్టెంబరు 28 తేదీన భద్రతాసంఘ సభ జరిగిన తరువాత, హైదరాబాదు నందలి నిస్సహాయులకు ముస్లిమ్ మైనారిటీపై ఘోర అత్యాచారములు జరుపబడెనని, ఇంకను అవి జరుపబడుచున్నవని నమ్మకమైన సాక్ష్యముతో కూడిన విషయజాలము విస్తారముగా నాకు చేరినది. ప్రభుత్వోద్యోగముల యందలి ముస్లిములు చాలామంది తొలగింపబడిరని హైదరాబాదు వెలుపల నుండి తీసికొని రాబడిన అధికారులు వారిస్థానే నియమింప బడిరని నాకు చేరిన విషయజాలము వల్ల తెలియుచున్నది. హైదరాబాదు నందలి ముస్లిమ్ మైనారిటీని క్రూరబాధలకు లోను చేయుటవల్ల యేర్పడిన మహా విషమస్థితిని భద్రతా సంఘ దృష్టికి తీసికొని వచ్చుట నా విధియని భావించుచున్నాను. త్వరలో భద్రతా సంఘ సభ జరిపి హైదరాబాదు పరిస్థితులను విచారించి తగిన చర్య గైకొనగలందులకు గాను ఈ విషయమును మీ దృష్టికి తీసికొని వచ్చుచున్నాను."

## 'ఇంకా నేను ఆర్థికశాఖ మంత్రినే'

తాను విదేశాంగ మంత్రి కాదని హైదరాబాదు నిజాం చెప్పెనను మాట వాస్తవము కావని నవాబ్ మోయిన్ నవాజ్ జంగ్ తరువాత తన ప్యారిస్ హోటలులో ప్రసంగించుచు చెప్పెను. 'ఇంకను నేను ఉద్యోగములోనే యున్నానని నేను చెప్పుదును' అని అతడనెను.

'పదిలక్షల పౌనులపై చిలుకు ఒక లండను బ్యాంకులో మరి యొకని పేర భద్రముగా నున్నది. సంస్థాన ఆస్తులను రక్షించుటకు గాను నేను దానిని మరియొకని పేరుకు మార్చితిని. అది యిప్పుడు ధర్మకర్తృత్వపు ఆస్తిగా నున్నది' అని అతడనెను.

ఈ పదిలక్షల పైచిలుకు పౌనుల ద్రవ్యమును రాబట్టుటకు కోర్టులో దావా వేయవలసినదని అక్టోబరు 5 తేదీన హైదరాబాదు నిజామ్ లండనునందలి భారత హైకమిషనరును కోరియుండెనని పాఠకులకు తెలిసియే యున్నది. ఈ ద్రవ్యము లండను వెస్టుమినిస్టరు బ్యాంకులో హైదరాబాదు సంస్థాన ఖాతాలో నుండెను. ఈ మొత్తమును మోయిన్ నవాజ్ జంగు లండన్ నందలి పాకిస్తాన్ హైకమిషనరు ఖాతాకు మార్చియుండెను.

# చాంగ్ కై షేక్ కొత్త వ్యూహం

(1-వ పేజీ తరువాయి)

నావని, విమానబలమునుకూడ అతనికే ఇవ్వ నిశ్చయించెననీ తెలిసినది.

## తూర్పునుండి కమ్యూనిస్టుల పురోగమనం

కియాంగ్సు రాష్ట్రపు ఉత్తర సరిహద్దులను తూర్పుగా వచ్చే కమ్యూనిస్టు సేనలు దాటినవి. ప్రక్కనే ఉన్న షాంటుంగ్, హోనాన్ రాష్ట్రముల సరిహద్దులను కూడా అవి దాటినవి.

చైనీస్ ప్రభుత్వసేన లింత బలహీనముగా సామర్థ్య రహితముగా ఉండుటకు ముఖ్యకారణ మొకటున్నది. ప్రభుత్వోద్యోగులలో ఉన్నతునినుండి సామాన్య పౌరుని వరకూ ప్రజలందరిలోనూ అపజయభావము మెండుగా ఉన్నది.

ప్రధాని వాంగ్ వన్ హావ్ రాజీనామా ఇచ్చిన తర్వాత అతనిస్థానే ఎవరిని నియమించుటకు చాంగ్ కై షేక్ కు తోచకున్నది. అందుచేత బలవంతముగా ఒప్పించి వాంగ్ నే ప్రధాని పదవిలో ఉంచినాడు. చాంగ్ కై షేక్ పై గల భక్తి కొద్దీ అయిష్టపడుతూనే వాంగ్ ప్రధానిత్వమును నిర్వహించుచున్నాడు.

సీపింగ్‌ను, పైహోనదిపై ఉన్న ప్రధాన రేవుపట్టణము టేంట్సిన్‌ను చివరివరకూ రక్షించెదమని టేంట్సిన్‌లోని ప్రభుత్వ సేనాని చెన్‌చాంగ్ చీన్ నేడు నమ్మకముగా చెప్పినాడు. మంచూరియాలో చాల ఆయుధములు నష్టమయినవని అంగీకరించుచు టేంట్సిన్ మేయరు ఇట్లనినాడు. "యుద్ధములో జయించుట కొరకు ఆయుధములున్న మాత్రాన చాలదు, సైనికుల ధైర్యంమీద అది ఆధారపడి వుంటుంది."

## షాంగ్‌హైను అంతర్జాతీయం చేయవలెనని సూచన

షాంఘై, నవంబరు 6: ప్రపంచంలో కల్లా 4 వ పెద్దపట్టణమైన షాంఘైను అంతర్జాతీయ రేవుపట్టణంగా చేయవలెనని

నేడు ఇక్కడ చర్చలు జరుగుచున్నవి.

ఈ ప్రతిపాదనకు చైనీస్ ప్రజలు, విదేశీయులుకూడా అంగీకరించెదరని చెప్పుచు షాంఘైలోని అమెరికన్ పత్రిక "ఈవెనింగ్ పోస్టు," ఈ ప్రతిపాదనను వాషింగ్టన్, లండను జాగ్రత్తగా పరిశీలించవలెనని హెచ్చరించెను. షాంఘైను రక్షణార్థి స్థావరంగా ఉంచవలెనుగాని ఏటం బాంబుల కాహుతిచేయ నూడదని ఈ పత్రిక ప్రకటించుచున్నది.

ప్రమాదం ఏర్పడిన పక్షంలో షాంఘై నుండి తమ తమ దేశీయులను తప్పించుటకు ఇచ్చటి విదేశీయ రాయబారులు అన్ని ప్రయత్నములను పూర్తి చేసుకొనుచున్నారు.

కమ్యూనిస్టులు షాంఘైవైపు పురోగమించుచున్నందున, నగరమును రక్షించుట కిక్కడ గతరాత్రి అత్యవసర చర్చలు జరిగినవి. అమెరికన్ యుద్ధనౌకలు రెండు, బ్రిటిష్ డిస్ట్రాయరు నౌక ఒకటి రేవును అనతిదూరంలో విడిసియున్నవి. హాంకాంగ్ నుండి ఇంకా కొన్ని నౌకలను పంపి షాంఘైలోని బ్రిటిష్‌వారిని ఖాళీచేయుటకు బ్రిటిష్ ప్రభుత్వ మాలోచించుచున్నది.

# జయపూరు కాంగ్రెసు అధ్యక్షుని ఊరేగింపు

ఢిల్లీ, నవంబరు 6: జయపూరు కాంగ్రెసు అధ్యక్షుని ఒంటెలతో ఊరేగించుట హిందూ సంప్రదాయము ననుసరించి అప్రశస్తమని నిర్ణయింపబడెను. అందువల్ల 55 ఎద్దులు అధ్యక్షుని రథమును లాగుటకు ఏర్పాటుచేయబడును.

1939 సం॥లో త్రిపురి కాంగ్రెసు సందర్భమును 51 ఏనుగుల ఊరేగింపు జరుపబడెను.

## నెహ్రూ-పట్టాభి చలోక్తి

పండిట్ జవహర్లాల్ నెహ్రూ నిన్న పాలమ్ విమానాశ్రయంలో దిగీదిగడంతోనే నూతన రాష్ట్రపతి డా॥ పట్టాభిని సమీపించి ఈ విధంగా అభినందించెను:—"మీరిప్పుడు రాష్ట్రపతి అయినారు; ఇక ప్రతివారు మీముందు మోకరించ వలసియున్నది." డా॥ పట్టాభిగారు దానికి చిరునవ్వు నవ్వుతూ, "ఈ వ్యవహారంఅంతా సావధానంగా చర్చించి తేల్చుకుందాము" అని సమాధానం ఇచ్చిరి. పండిట్ నెహ్రూ వచ్చేవారం ప్రారంభంలో పత్రికా ప్రతినిధులతో గోష్ఠి జరపవచ్చునని తెలియుచున్నది.

## డా॥ పట్టాభికి మైసూరు కాంగ్రెస్ అభినందనలు

బీరూర్, నవంబరు 6: కాంగ్రెస్ మహాసభాధ్యక్షులుగా నెన్నుకొనబడినందుకు డా॥ పట్టాభి సీతారామయ్యగారి నభినందించు తీర్మానము నొకదానిని అఖిల మైసూరు కాంగ్రెస్‌కమిటీవారు నేడు గావించిరి.

జిన్నా, కె. ఎఫ్. నారిమన్ల మరణములకు సంతాపము వెలిబుచ్చు మరియొక తీర్మానమునుకూడ సభవారు గావించిరి.

(అ. ప్రె.)

## ట్రూమను విజయం: డా॥ పట్టాభిగారి ప్రశంస

ఢిల్లీ, నవంబరు 6: అమెరికా అధ్యక్షపదవికి ట్రూమను ఎన్నుకోబడినందుకు జయపూరు కాంగ్రెసు అధ్యక్షునుగా ఎన్నుకోబడిన డా॥ పట్టాభి సీతారామయ్యగారు యిట్లు చెప్పిరి:—

భారతదేశ మిప్పుడు స్వతంత్రరాజ్యమగుటవల్ల విదేశాల వ్యవహారములలో శ్రద్ధాసక్తులను వహింపగల్గుచున్నది. చైనా రాజ్యకష్టస్థితిని గూర్చియు అమెరికాలో అధ్యక్షపదవికి జరిగిన ఎన్నికలనుగూర్చియు శ్రద్ధవహించుచున్నది. అమెరికా అధ్యక్షపదవికి ట్రూమను ఎన్నుకోబడుటవల్ల అమెరికాలోని దేశీయవ్యవహారములకును, అమెరికాయొక్క అంతర్జాతీయ వ్యవహారములలోను మార్పులు కలుగకుండా సుస్థిరత్వము నిలకడ ఏర్పడుటకు అవకాశము కలిగినది.

# కమ్యూనిస్టులకు రష్యా సహాయం

పెకింగ్, నవంబర్ 6: ప్రచ్ఛన్న వేషధారులైన రష్యన్లు మంచూరియాలో కమ్యూనిస్టు సైన్యములకు తోడ్పడుచున్నారు. హార్బిన్‌కు సోవియట్ సరిహద్దుకు మధ్యఉన్న రైలుమార్గము అంతా పూర్తిగా రష్యన్ల చేతులలోనే ఉన్నది. అనేకమంది సాయుధ రక్షకభటులు టాంకులలోను విమాన విధ్వంసక ఫిరంగుల తోనూ ఈ రైలుమార్గమును కాపాడుచున్నారు.

మంచూరియాకు సోవియట్ సరిహద్దుకు మధ్య ఒక క్రొత్త రైలుమార్గం వేయబడుచున్నది.

## కృష్ణానది నీటిమట్టం

విజయవాడ, నవంబరు 6: నేటి ఉదయం కృష్ణానది నీటిమట్టం అనకట్టపై 6.6 అడుగులున్నది.

# కాంగ్రెసు పార్టీకి పండిత నెహ్రూనివేదన

## డా॥ పట్టాభి అధ్యక్షతను ప్రత్యేక సభ

న్యూఢిల్లీ, నవంబరు 7: తన ఐరోపా పర్యటన విశేషములను గూర్చి ప్రధాని పండిత నెహ్రూ చెప్పుదానిని వినుటకు నేడు రాజ్యాంగ పరిషత్తు నందలి కాంగ్రెస్ పార్టీ ప్రత్యేకసభ డా॥ పట్టాభి సీతారామయ్యగారి అధ్యక్షతను జరిగెను. లండనునందు కామన్‌వెల్తు ప్రధానుల సభలోను, ప్యారిసులోను తాను చేసిన పనిని ప్రధాని వివరించి చెప్పెను. అంతర్జాతీయ పరిస్థితులనుగూర్చియు, ప్రపంచములో ప్రస్తుత సమయమున భారతదేశ స్థానమును గూర్చియుకూడ సంక్షిప్తముగా ముచ్చటించెను.

దాదాపు 141 మంది సభ్యులు సభకు వచ్చిరి. వీరిలో డా॥ అంబేద్కరు సర్దారు పటేలు రాజ్‌కుమారి అమృతకౌరు, శ్రీ ఎన్. గోపాలస్వామి అయ్యంగారు, డా॥ ఎస్. పి. ముఖర్జి, మోహన్‌లాల్ సాక్సేనా శ్రీ కె. సంతానం, ఠక్కర్‌బాపా, శ్రీ బి. జి. ఖేర్, గోపీనాథ బార్డోలాయ్, ఆచార్య కృపాలనీ, శ్రీ టంగుటూరి ప్రకాశం, పి. డి. టాండన్, కాశీరామ్ చంద్‌గారలు కలరు. అ. ప్రె.

# గ్రీసుతో సంప్రతింపులకు రష్యా సుముఖత

పారిస్, నవంబరు 6: గ్రీకు గొరిల్లాలకు సహాయం చేస్తున్నందుకు యుగోస్లావియా, బల్గేరియా, అల్బేనియాలను గర్హించవలసిందిగా కోరుతూ బ్రిటిష్ అమెరికా ఫ్రెంచి చైనా ప్రతినిధులు ప్రతిపాదించిన తీర్మానమును తాము బలపరచుచున్నామని స్వీడెన్ నార్వే ప్రతినిధులు నేడు రాజకీయ సంఘంలో ప్రకటించిరి.

బల్గేరియా, అల్బేనియా, యుగోస్లావియా ప్రతినిధులూ గ్రీకు ప్రభుత్వ ప్రతినిధులూ తమలో తాము సంప్రతింపులు జరుపుకొని సామరస్య సాధనకు ప్రయత్నించవలెనని ఆస్ట్రేలియా తీర్మానమును ప్రతిపాదించెను. తాను ప్రతిపాదించిన తీర్మానమునే మున్ముందుగా వోటుకు పెట్టవలెనని ఆస్ట్రేలియా ప్రతినిధి హాడ్జ్‌సన్ సభికులకు విజ్ఞప్తిచేసెను.

ఆస్ట్రేలియా తీర్మానమును రష్యా హృదయపూర్వకముగా బలపరచుచున్నదని విషిన్‌స్కీ ప్రకటించెను.

## బ్రిటన్ అమెరికాలపై విషిన్‌స్కీ ఆరోపణలు

నేటి మధ్యాహ్నపు రాజకీయ సంఘ చర్చలలో రష్యా ప్రతినిధి విషిన్‌స్కీ గ్రీకు ప్రభుత్వమును, దానికి తోడ్పడుచున్న బ్రిటన్, అమెరికాలను తీవ్రముగా విమర్శించెను.

బ్రిటన్, అమెరికాల ప్రేరేపణతో గ్రీకు ప్రభుత్వము గొరిల్లాలపై విషవాయువు ప్రయోగింపనున్నదని అతడారోపించెను.

బాల్కన్ రాజ్యాల పరిస్థితులపై నివేదికను తయారుచేసి సమితి కర్పించిన బాల్కన్స్ కమిటీని విమర్శించుచు "వారి సాక్ష్యమంతయు తప్పుల తడక" అని కూడ అతడు ప్రకటించెను.

# గ్రీకు కార్మిక నాయకులపై మరణదండన

పారిస్, నవంబరు 6: గ్రీకు ప్రతినిధి వర్గ నాయకుణ్ణి కలుసుకొని గ్రీకులు 10 మంది కార్మిక నాయకులకై ఇటీవల విధించిన మరణ శిక్షలను రద్దు చేయించడానికి ప్రయత్నించవలసిందని ఐక్యరాజ్య సమితి రాజకీయ సంఘం నేటిరాత్రి కమిటీ అధ్యక్షునికి ఆదేశించెను.

ఈ పదిమందిని సోమవారంనాడు ఉరితీయబోతున్నారు. ఈ విషయమై తన ప్రభుత్వంతో సంబంధం ఉత్తర ప్రత్యుత్తరములు జరిపెదనని గ్రీకు ప్రతినిధి పిపినెలిస్ హామీ ఇచ్చెను.

# ధర్మకర్తృత్వం క్రింద ఉన్న దేశాలు

పారిస్, నవంబరు 7: రాజకీయంగానూ, ఆర్థికంగానూ, సాంఘికంగానూ తమ ప్రత్యేకసహోదాను హానికలగని పక్షంలోనే ధర్మకర్తృత్వము కిందనున్న ప్రదేశములను సలసరాజ్యములతో చేరనివ్వవచ్చుననీ, హానికలుగుతుందని తోచినపక్షంలో రెండుపరిపాలనావ్యవస్థలను ప్రత్యేకంగానే ఉంచవలెననీ, ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వ సంఘము నేడు తీర్మానించినది. ధర్మకర్తృత్వ వలసరాజ్యాల పరిపాలనావ్యవస్థలను ఏకీకరించడం, ఏ పరిస్థితులలో అంగీకారయోగ్యమో విచారించుమూ ఇండియా, ఇరాక్, క్యూబా, ఫిలిప్పైన్స్, వెనిజులా ప్రతినిధులు ఒక సంయుక్త తీర్మానము ప్రతిపాదించిరి; ఈ తీర్మానమును కమిటీ నిన్న ఆమోదించెను. టాంగన్యికాను కేన్యా ఉగండాలతో కలిపి బ్రిటన్ పరిపాలించుచున్న విధానమును అంగీకారయోగ్యము గానే ఉన్నదని ఈ తీర్మానములో ఉల్లేఖింపబడెను.

# "గ్రామపంచాయతీలకు రాజ్యాంగంలో తగినస్థానము ఇచ్చి తీరాలి"

## డా॥ అంబేద్కర్ భావములతో ఏకీభవింపజాలనని సంతానం: పరిషత్ సమావేశంలో ముసాయిదాపై చర్చ

న్యూఢిల్లీ, నవంబరు 6: భారతదేశ నూతన రాజ్యాంగముపై ప్రజాపరిషత్తు నేడుకూడ చర్చజరిపి, సమావేశమును రేపు సోమవారమునాటికి వాయిదా వేసినది. పలువురు సభ్యులు కోరినందువల్ల సోమవారమునాడుకూడ రాజ్యాంగముపై సాధారణచర్చనే జరుపుటకు నిర్ణయింపబడినట్లు ఉపాధ్యక్షుడు హెచ్. సి. ముఖర్జీగారు ప్రకటించిరి. ఎక్కువమంది సభ్యులు చర్చలో పాల్గొనుటకు వీలుగా ఈ నిర్ణయము చేసిరి.

భారతప్రధానామాత్యుడు నెహ్రూ, ఉపప్రధాని సర్దార్ పటేల్‌గారలు ఇద్దరూ నేటి సమావేశమునకు హాజరైరి. సభాభవనమున ఈ నాయకద్వయము ప్రవేశించగనే సభ్యుల కరతాళధ్వనులు మిన్నుముట్టెను. భారతదేశ నూతనరాజ్యాంగము గత 30 సంవత్సరములుగ స్వాతంత్ర్యసమరమున పాల్గొన్నవారు వాంఛించినట్లు లేక ఆశాభంగము కలిగించుచున్నదని ప్రకాశంపంతులుగారు విమర్శించిరి. అల్పసంఖ్యాకులకు ప్రత్యేకరక్షణలు అవసరమని పలువుర సభ్యులు సూచించిరి. అల్పసంఖ్యాకులు పార్సీలెగవారిని ఆదర్శముగ పెట్టుకొని ఎట్టి ప్రత్యేకరక్షణలు తమకు వద్దని స్పష్టపరచవలెనని ఆర్. కె. సిధ్వాగారు ఉద్బోధించిరి.

## రాజ్యాంగ ముసాయిదాపై స్థూలంగా చర్చ

### పరిషత్తు సమావేశంలో ప్రకాశంగారి విమర్శ

ఢిల్లీ, నవంబర్ 6: నేడుదయము భారతీ రాజ్యాంగ పరిషత్తు తిరిగి సమావేశమై భారత రాజ్యాంగ విధానపు ముసాయిదాను గూర్చిన చర్చ తిరిగి ఆరంభించినది. నేడు సర్దారు వల్లభాయి పటేలుగారు పరిషత్తుకు హాజరైరి. ఆయన పరిషత్తు సభలోనికి రాగానే సభ్యులు హర్షధ్వానములు చేసిరి.

నేడు చర్చ ఆరంభముకాగానే అరుణచంద్ర సప్తగారు మొట్టమొదటగా ఉపన్యసించుచు ఇట్లు చెప్పిరి.

ఈ రాజ్యాంగ విధానము ఆర్థిక విషయములలో ప్రజల హక్కులను నిరూపించలేదు. ప్రజలకు జీవనోపాధులను విద్యాసౌకర్యములను విశ్రాంతి సౌకర్యములను కల్పించవలసిన బాధ్యతలు ప్రభుత్వానికి విధింపబడలేదు. భారతదేశ రాజ్యాంగ విధానము గ్రామములను గ్రామజీవితమును ఆధారముగా స్వీకరించి ఆ పునాదిమీద ఏర్పరుప బడవలెనని గాంధి మహాత్ముడు కోరియుండెను.

ఆయన మనోరథము ఈ రాజ్యాంగ విధానములో యీడేరలేదు. ఇప్పుడైనను యీ రాజ్యాంగ విధానములో అట్టి పథకమును కల్పించవలెను. రష్యాలో 8 లేక 9 ప్రధాన భాషలు ప్రభుత్వ వ్యవహారములకు ఉపయోగపడుచున్నవి. ఆ రీతిగా భారతదేశములో కూడా ప్రధానమైన భాషలను శాసనసభలో ఉపయోగించుటకు అనుమతింపవలెను కాని హిందీ మాత్రము అగ్రస్థానము వహించగలదు.

### టంగుటూరి ప్రకాశంగారి యుపన్యాసము

టి. ప్రకాశంగారు ఇట్లుపన్యసించిరి. గత 30 సం॥ నుండియు గాంధిమహాత్ముని నాయకత్వమున దేశస్వాతంత్ర్యము కొరకై పోరాడినటువంటి దేశసేవకుల కోరికల ననుసరించి యీ రాజ్యాంగ విధానము తయారు కాగలదని ఆశించుచున్నాను. కాని యిది ఆరీతిగా తయారు అగుటలేదు. ఇది నాకు ఆశాభంగకరమైనది. అందుచే నేను డా॥ అంబేద్కరుగారిని నిందించను. ఎందుచేతనవగా ఇతరులవలె దేశస్వాతంత్ర్య పోరాటములో చేరి డా॥ అంబేద్కరుగారు పోరాడినవారుకారు. అంతేకాదు ఆయన గాంధీ సిద్ధాంతములకును గాంధీ విధానములకును ప్రతికూలుడు. అందువల్లనే, డా॥ అంబేద్కరు గారు ఒక్క దెబ్బలో గ్రామపంచాయితీలను గిల్లించి ఖండించిరి. ఈరాజ్యాంగ విధానము కోట్లకొలదిగానున్న గ్రామీణులకు అక్కరకువచ్చే పద్ధతిలో తయారుచేయవలెను. ఈగ్రామీణులకు ప్రజాసామాన్యాభ్యుదయముకొరకే మనము స్వాతంత్ర్యమును సాధించితిమి. ధనిక ప్రాబల్యమును తొలగించుటకై గట్టి ప్రయత్నము చేయవలెను. గాంధిమహాత్ముడు అట్టి ఆవశ్యకతను గమనించియుండెను. అందుకొరకై మహాత్ముడు తన నిర్మాణకార్యక్రమ విధానమును ఉపక్రమించెను. ప్రతి స్త్రీయును, పురుషుడును కర్మకారులై దేశానికి కావలసిన సేవచేయవలెనని మహాత్ముడు ఆదేశించెను.

### డిసౌజా గారు

ఈ రాజ్యాంగవిధానం దివ్యంగా ఉంది. అల్పసంఖ్యాకవర్గములయొక్క రక్షణలకై రచియింపబడిన నిబంధనలు తృప్తికరముగా నున్నవి. అల్పసంఖ్యాకవర్గముల హక్కుల విషయమై బాధ్యత వహించుటకు నియమింపబడు అధికారులు కేంద్రప్రభుత్వానికి జవాబుదారులై యుండవలెను. కేంద్ర ప్రభుత్వము విశేషాధికారములను కలిగి బలిష్ఠముగా నుండవలెను. అట్టి అధికారబలము గల కేంద్రప్రభుత్వము ఇదివరలో యీ దేశమందు లేకపోవుటవల్లనే అనేక రాజవంశములు కూలిపోయినవి.

రాష్ట్ర కేంద్రప్రభుత్వముల సమష్టి యాజమాన్యమున నిర్వహింపబడు శాఖల జాబితాలను తగ్గించుట అవసరమనీ, ఈ శాఖలలో కేంద్రప్రభుత్వ ప్రాజాపత్యము ఎంతవరకు వుండగలదో కనీసము నిర్వచించుట అయినను జరుగవలెననీ కే. సంతానంగారు సూచించిరి. ఈ సమష్టి జాబితాయే పర్యవసానముగా ఫెడరల్ అధికారముల జాబితాగా పరిణమించగలదనీ ఇట్టి ప్రమాదము ఏర్పడకుండ జాగ్రత్తవహించవలెననీకూడ సంతానంగారు సలహాఇచ్చిరి. రాష్ట్ర కేంద్రప్రభుత్వములమధ్య అధికారబాధ్యతలను సుస్పష్టముగా నిర్వచించి రెంటికీమధ్య ఖండితమైన సరిహద్దులను నిర్ణయించుట అవసరమనీ వీరు ఉద్ఘాటించిరి. "ఈ విషయమున ఏమాత్రము సందిగ్ధము పనికిరాదు. భారత రాజ్యాధిపతియగు అధ్యక్షునికి, గవర్నర్లకు ప్రసాదించదలచిన అధికార ఆదేశములపట్టిక ప్రధానితోనూ, అతని మంత్రివర్గముతోనూ, అధ్యక్షునకు, గవర్నర్లకు సంఘర్షణను తెచ్చిపెట్టి అవకాశము కలిగించునట్లు వున్నది. లసుపు బిగువులకు, చేర్పుకూర్పులకు వశ్యమైన రాజ్యాంగముకంటె భారతదేశ మునకు ఇప్పటున్న కౌనలసినది సుస్థిరమైన రాజ్యాంగమే. అందుచేత మంత్రివర్గ బాధ్యతలకు సంబంధించిన ఏర్పాట్లను అతి జాగ్రతగా పునః పరిశీలనచేసి తీరవలెను. రాజ్యాంగమును సవరణచేయుటకు ఇందులో చెప్పినదానికన్న ఎక్కువ కఠినమైన షరతులను పెట్టుటే మాకుసమ్మతము." అని సంతానంగారు హెచ్చరించిరి.

### గ్రామాలపై అంబేద్కర్ విసుర్లకు సమాధానం

గ్రామ భవిష్యద్వ్యవస్థపై డా॥ అంబేద్కర్‌గారి భావములతో తాను ఏకీభవింపజాలక పోవుచున్నాననికూడ వీరనిరి. "గ్రామములే లేకపోయినచో భారతదేశమున ఆరాంతి తాండవించెడిదే. అందుచేత గ్రామపంచాయితీలను సక్రమముగా పరిగణించుటకు శాసనబద్ధమైన ఏర్పాటు ఒకటి అవసరము. సంస్థానములకు, రాష్ట్రములకు మధ్య సృష్టించిన కృత్రిమవిభజనను సాధ్యమైనంత త్వరలో నష్టపరిచి చెప్పవలెను. దీనికి కొన్ని ఆర్థిక వ్యవహారములు మాత్రమే అడ్డువచ్చుచున్నట్లు కనబడుచున్నది. వీటి రక్షణకు ఏదైన ఒకసూత్రమును కనుగొన్న యెడల, రాష్ట్రములు పాయికి వచ్చుటకు సంస్థానములు అన్యం తేరము చూపకపోవచ్చును.

భారత పౌరుల ప్రాథమిక హక్కులలోకూడ కొన్ని వినతిపుకులున్నవి. ఆమెరికన్ సుప్రీమ్ న్యాయస్థానమువలెనే భారతదేశపు సుప్రీమ్ న్యాయస్థానముకూడ ఓటిని సవరించవలసివుండును. ఇట్టి అవకాశముకులిగించగలిగినయెడల, ఆసలు ఈ అధ్యాయమును పూర్తిగా తీసివేయవచ్చును. దేశమున ఎట్టి అవాంతరపరిస్థితులు ఏర్పడినను, ప్రజల హారహక్కులలో కనీసము కొన్నిటినైనను కాపాడుట ఆవశ్యకరము. దేశ శాసనసభ ఇష్టేతొలగించివేయుటకు వీలుగా ఈ పౌరహక్కులు వుండరాదు.

పయోజనములైన వోటర్ల జాబితాలను తయారుచేయించి,వాటిని పదిలముగా వుంచు బాధ్యత కేంద్రప్రభుత్వముపైనే వుంచవలెను. ఈ బాధ్యతలు రాష్ట్రప్రభుత్వములపై పెట్టుటవలన భాషా విభేదములు, స్థానిక విభేదములు లేదితర కారణములు సక్రమమైన వోటర్ల జాబితాల తయారీకి అడ్డురావచ్చును" అని సంతానంగారు హెచ్చరిక చేసిరి.

### సంస్థాన ప్రతినిధి విమర్శ

సంస్థానములనుకూడ రాష్ట్రముల స్థాయికి తేవలెనను ప్రతిపాదనను జయనారాయణ వ్యాస్ గారు బలపరిచిరి. రాజ్యాంగపరిషత్తు ఉద్దేశ్యముకూడ ఇదే అయినప్పటికీ, రాజ్యాంగపు ముసాయిదాలో దీనిసాధనకై ప్రయత్నమేమియు జరుగలేదని జయనారాయణ వ్యాస్ గారు విమర్శించిరి.

సంస్థానములను ప్రత్యేక భాగములగ వుంచుటకు నిర్ణయించిన ఏర్పాట్లు, విధానముకూడ అతి అస్పష్టముగ ఉన్నవనీ, ఏ పద్ధతిని అనుసరించి ఈ ఏర్పాటు జరుగవలెనని నిర్ణయింపబడినదో విశదముగుట లేదనీ వ్యాస్‌గారనిరి.

హిందీనే భారత జాతీయభాషగా పరిగణించవలెనను వాదనను లాలారాజ్ కుష్వార్‌గారు బలపరిచిరి. హిందీభాషను ఆమోదించిన కారణముగ ఉర్దూ భాషకు ప్రతిబంధకము ఏర్పడగల అగత్యమేమియు లేదని చెప్పిరి. ఉర్దూ భాషకు కొన్ని ప్రత్యేక లక్షణము లున్నవనీ, దానిని కూడ పోషించవచ్చుననీ అనిరి. జాతికి దైవబలము కావలెననియు, భగవంతుని ఆశీస్సులను అర్థించుచు రాజ్యాంగ ఉపోద్ఘాతమున కొన్ని మాటలు చేర్చవలెననియు వీరు ప్రతిపాదించిరి.

### ఆర్. కె. సిధ్వా

ఇప్పుడు దౌర్భాగ్యస్థితియందున్న స్థానిక సంస్థలు నూతన రాజ్యాంగముక్రింద కూడా అదే స్థితియందుండగలవని, వాటి మార్పుకు ప్రయత్నము జరుగలేదనీ ఆర్. కె. సిధ్వాగారు విమర్శించిరి.

స్థానిక సంస్థల ఆదాయావకాశములను, అధికారములను ఎక్కువ చేసినగాని, మన దేశమున గ్రామములుగాని, ప్రజాస్వామికవిధానముగాని ప్రవర్ధమానము కాజాలవని చెప్పుచూ, ప్రాథమిక హక్కుల అధ్యాయములో కొన్ని భాగములను రాజ్యాంగరచనా సంఘము మార్పుచేసినందుకు సిధ్వాగారు ఖండించిరి. ఈ సంఘము ఈ చర్యద్వారా, వాస్తవముగ తన అధికారములను అతిక్రమించినదని కూడ ఆరోపించిరి. "ప్రాథమిక హక్కులను పరిషత్ సభ్యులు యిదివరకే ఆమోదించి వున్నారు. అందుచేత వీటిలో మార్పులు సూచించు అధికారము రచనాసంఘమునకు లేదు... ప్రత్యేకముగవున్న సంస్థానములకు, సంస్థాన సమాఖ్యలకు వేరు రాజ్యాంగములు వుండుట పనికిరాదు. రాష్ట్ర రాజ్యాంగములనే వీటికి తగినవిధముగా వర్తింపజేయవలెను. సాధ్యమైనచో సంస్థానాధీశులను ఆయా సంస్థానములకు వంశపారంపర్యముగ గవర్నర్లుగ చేయవచ్చును." అని సిధ్వాగారు సూచించిరి. అల్పసంఖ్యాకవర్గములకు ప్రత్యేక రక్షణలను, స్థానములను ఇచ్చినందుకు అధికసంఖ్యాక వర్గమును సిధ్వాగారు అభినందించిరి.

భారత రాజ్యాంగపు ముసాయిదా ఆదిలో పరిషత్ ఆమోదించిన లక్ష్యనిర్వచన తీర్మానమును అనుసరించే వున్నదని మాండలాయ్‌గారనిరి. రాష్ట్రములకు ఇప్పటికంటె ఎక్కువ న్యాయసమ్మతమైన పద్ధతిలో ఆర్థికసహాయమును పంచుట అవసరమనీ, దేశ చిరకాల దారిద్ర్యమును బాపుటకు రాష్ట్రములకు అధికముగ ధనము కావలసి వుండుననీకూడా వీరు ప్రసంగించిరి. అల్పసంఖ్యాకులు తమకు వచ్చుచున్న ప్రత్యేక సౌకర్యములను స్థానముల కేటాయింపును తమకై తామే ఐచ్ఛికముగ వదులుకొనుట అవసరమనీ, అప్పుడు అల్పసంఖ్యాకుల పరిస్థితి మరింత ఉన్నతముగ వుండగలదనీకూడ ఉద్బోధించిరి. బలీయమైన భారతదేశమును నిర్మించుటలో వీరు అధికసంఖ్యాకులతో సరిసమానముగ ముందంజవేసి కృషిచేసినయెడల, అధికసంఖ్యాకులను చూసి అల్పసంఖ్యాకులు భయపడవలసిన అగత్యము వుండదనికూడ నుడివిరి.

### రష్యా రాజ్యాంగం

రాజ్యాంగపు ముసాయిదా పెద్దగ్రంథముగ తయారైనదని వచ్చిన విమర్శకుసమాధానమిచ్చుచూ పండిత బాలకృష్ణశర్మగారు మానవకోటిలో ఐదవవంతు ప్రజలకు తయారుచేయుచున్న రాజ్యాంగముకునుటచేత ఇంత బృహత్ గ్రంథముగ తయారైనదని చెప్పిరి.

రష్యన్ రాజ్యాంగమునుండి ఏవిషయమును సేకరించుటకు ప్రయత్నమే జరుగలేదను విమర్శకు బాలకృష్ణశర్మగారు ఇట్లు సమాధానమిచ్చిరి: "రష్యాలో 1917 లో విప్లవము వచ్చినతరువాత, 18 సంవత్సరములపాటు రష్యనులు ఏకపక్ష నియంతృత్వ పరిపాలననే కట్టుదిట్టముచేసి స్థాపించిరి.

రష్యన్ రాజ్యాంగములో అల్పసంఖ్యాకులకు సంపూర్ణావకాశములు ఇవ్వబడినవని వాదించుచున్నారు. ఈసందర్భమున, దాదాపు 18 సంవత్సరములపాటు సాగిన ఏకపక్ష పరిపాలనలో కమ్యూనిస్టులు విరోధ రష్యాపై రిపబ్లికులకు బలీయమైన కేంద్రస్థానములుగ చేసుకొనినను విషయమును మరవరాదు. కేంద్రమునుండి విడిపోవు అధికారమును ఆయా భాగములకు రాజ్యాంగము ప్రసాదించినది; కాని, ఆచరణలో అది విడిపోవు విషయమై ఊహించుటకైనను అవకాశములేదు. భారతదేశము ప్రజాస్వామ్యపద్ధతులలో వర్ధిల్ల వలెనని అభిలషించుచున్నది; రష్యన్ రాజ్యాంగము విప్లవాత్మక నియంతృత్వ స్థాపనను ప్రాతిపదికగా పెట్టుకొన్నది."

### కాందిశీకులకు పౌరస్వత్వం

రాజ్యాంగపు ముసాయిదాలోని కొన్ని భాగములను విమర్శించుచు పండిత ఠాకూర్దాస్ భార్గవగారు ఇట్లనిరి: "పాకిస్థాన్‌నుండి వచ్చిన భారతీయులందరూ స్వతఃసిద్ధముగ భారత పౌరులగుటకు సులభమైన, సరళమైన ఏర్పాటును చేయవలెను. అల్పసంఖ్యాకులకు ప్రత్యేకస్థానముల కేటాయింపుపద్ధతికి నేను ఏమాత్రము సమ్మతించజాలను. ప్రస్తుతము నిర్ణయించిన స్థానముల కేటాయింపుపద్ధతి, సమష్టి నియోజకవర్గములపద్ధతి. ఇటు అధిక సంఖ్యాకులకుగాని, అటు అల్పసంఖ్యాకులకుగాని ఎవరికీ శ్రేయోదాయకము కాజాలదు. స్థానముల కేటాయింపు అవసరమైనపక్షమున నామినేషన్ పద్ధతినే అనుసరించవచ్చును. భారతదేశ భవిష్యత్ అధ్యక్షునికే ఈ బాధ్యతను నమ్మకముగ వదలివేయవచ్చును. నియోజకవర్గములను ప్రాంతీయవిభాగముపై ఏర్పరచవలెను. గ్రామ, పట్టణ నియోజకవర్గములలను వ్యత్యాసమును రద్దుచేయవలెను," అని ఠాకూర్ భార్గవగారు సూచించిరి.

దేశ ఆర్థిక స్వాతంత్ర్యమునకు రాజ్యాంగములో స్థానమే లేనందుకు యుధిష్ఠిర మిశ్రగారు తమ అసమ్మతి తెలిపిరి. ఇంకను ఇట్లు విమర్శించిరి: "దేశ ఐశ్వర్యమును ఫలానాగడువులోపుగా జాతీయము చేసెదమను హామీకూడ ముసాయిదాలో లేదు. దేశములోని ప్రతిపురుషునికీ, ప్రతిస్త్రీకీ పనికల్పించబడునను హామీకూడ ఇందులో కనబడదు... విచారణజరుపక వ్యక్తులను నిర్బంధించుటకు అధికారమునిచ్చుట మంచిది కాదు; దీనిని తొలగించివేయవలెను."

### గ్రామపంచాయతీల స్థాపన

శిబన్‌లాల్ సెక్సేనాగారు ఇట్లుఅనిరి: "గ్రామ పంచాయితీలను, రిపబ్లికులను స్థాపించుటకు వీలుగా రాజ్యాంగపు ముసాయిదాను సవరించవలెను. ఎగువ శాసనసభ ఎన్నికలలో ఈ గ్రామ పంచాయితీలే పాల్గొనునట్లు చేయవలెను. దేశములో ఎక్కడా గోవధ జరుగరాదనికూడ రాజ్యాంగము శాసించవలెను. ప్రజలమనోభావములను పాటించు నిమిత్తమయి, దేశ ఆర్థిక అవసరముల నిమిత్తమయి గోవధను నిషేధించుట అవసరము.

గ్రామములు స్థానిక వివాదములకు, అజ్ఞానమునకు కేంద్రములని డా॥ అంబేద్కర్‌గారు వెలిబుచ్చిన భావములను విమర్శించుచు బి. దాస్‌గారు ఇటు ప్రసంగించిరి: "విద్యాధికులు గ్రామసీమను విల్లుచున్నారనిన మహాత్ముని ప్రబోధమె కారణము. ఇతర దేశములలోని నగరములవలెగాక, మన దేశమున నగరములకు గ్రామములకు ఏవిధమైన సంబంధము లేక పోవుచున్నది. ఇందుచేతనే భారతదేశ గ్రామసీమలలో మంచి అన్నది ఏమాత్రము లేదని భావించుట మొదలు పెట్టినాము. డా॥ అంబేద్కర్ గారు తమ అభిప్రాయములను పునః పరిశీలన చేసుకోవలెననీ, గ్రామములకు మన రాజ్యాంగములో యథోచిత స్థానమివ్వవలసినదనీ విజ్ఞప్తి చేయుచున్నాను. దక్షిణ భారత మిత్రులు కొందరు "భాషా సామ్రాజ్యతత్వ ప్రసక్తి తెచ్చుచున్నారు. వీరికి ఒక్క ఆంగ్లభాష తప్ప మరేభాషయును మాట్లాడ లేమని వాదించే పక్షమున, దక్షిణాదిలో గ్రామసీమలలో నివసించు కోట్లాది ప్రజలకు ఆంగ్లము రాదను విషయమును వీరు మరువరాదు. ఆంగ్లభాషకు స్వస్తి చెప్పుట ఒక్క రేమనకు మూర్ఖాంతరము. ఈ విషయమున కొన్ని చిక్కులు వుండవచ్చు. దక్షిణ భారత ప్రజాబాహుళ్యము హిందీ మాట్లాడుటకు కొంత వ్యవధి అవసరమే కావచ్చును."

ఒరిస్సా, సి. పి. సంస్థానాలఆటవిక తెగల ప్రజల దుర్భరస్థితిని ప్రస్తావించుచు దాసుగారు ఇట్లనిరి: "కేంద్ర ప్రభుత్వము కొన్ని ప్రత్యేక ఆర్థిక సహాయములను కలిగించి వీరి అభివృద్ధికి దోహదమివ్వవలెను; రాష్ట్ర ప్రభుత్వములు తమంతట తాము ఈవిషయమైన ఎట్టి సహాయమును చేయలేవు."

### జాతీయ భాష

రణవీరసింగ్‌గారు జాతీయభాషా సమస్యను ఇప్పుడే పరిష్కరించుట అవసరమనిరి. ఈ నిర్ణయము జరిగినచో ఆభాషను ప్రజలు ఇప్పటినుండియే నేర్చుకొనుటకు వీలుకలుగునని తమ వాదనను బలపరుచుకొనిరి. నూతన రాజ్యాంగమున గ్రామములకు తగిన స్థానము వుంచి తీరవలెననీ, గ్రామపట్టణ నియోజకవర్గములకు భేదమును తొలగించుట ఇప్పుడు అనవసర సాధ్యముకాదనీ, మతము రీత్యా అల్పసంఖ్యాకులకు స్థానముల కేటాయింపు కూడదనీ కూడ చెప్పిరి. ఈ కేటాయింపు మూలమున అల్పసంఖ్యాక సమస్య శాశ్వతముగ నిలచిపోగలదని కూడ హెచ్చరిక చేసిరి.

రాజ్యాంగపు ముసాయిదా బ్రహ్మాండమైన కృషి అని ఆర్. దివాకర్‌గారు శ్లాఘించిరి. వీరు ఇట్లు విమర్శించిరి: రాజ్యాంగరచనా సంఘము తన అధికారములను అతిక్రమించి వ్యవహరించినది. రాజ్యాంగపరిషత్తు ఆమోదించిన నిర్ణయములను ఈ సంఘము పునఃపరిశీలనచేసి, సవరణలను మార్పులను కూడ చేర్చినది. పరిషత్ వెనువెంటనే ఈ ముసాయిదాను ఆమోదించరాదు. సభ్యులు అనేక ప్రధాన విషయములను సరింగ పరిశీలించుచున్నారు. జాగ్రతగ ఆలోచించనిదే వారు ఎట్టి నిర్ణయములకూ రాలేరు... దేశమంతటికి ఒక్క జాతీయ ప్రభుత్వభాష వుండుట అవసరము; ఇది బహుశా హిందీయో కావచ్చు. అంతమాత్రముచేత ఆ భాషలోనే ఇప్పుడు ఈ రాజ్యాంగమును ఆమోదించుట అవసరమనుటలో అర్థములేదు. హిందీభాషలో రాజ్యాంగమునకు కావలసినంతపారిభాషిక సంపదలేదు. అందుచేత ఇప్పుడు ఆంగ్లభాషలోనే ఆమోదించి తీరవలెను. ఆంగ్లమనిన శత్రుత్వమును ఇకనైనను మానవలెను."

### లాయర్ల పాలిటికి పంట

హిమత్‌సింగ్ మహేశ్వరిగారు ఇట్లనిరి: "ఈ రాజ్యాంగపు ముసాయిదా లాయర్లపాలిటికి పంట. దీనిలోని పదజాలము ప్రజలను విపరీతంగా కోర్టులకు ఎక్కించేదిగానూ, సత్యమునిన అభిమానమును పోగొట్టునదిగానూ వున్నది. క్లాజువారీ చర్చ జరుగునపుడు ఈ లోటుపాట్లన్నిటినీ సవరణచేయవలెను... అల్పసంఖ్యాకులకు ప్రత్యేకముగ స్థానములను కేటాయించు పద్ధతికి నేను ప్రతికూలుడను. ఈ కేటాయింపు మూలమున దేశమునకొక ప్రజారాజ్యస్థాపన కష్టసాధ్యము కాగలదు."

ఆనంతరం సభ సోమవారం ఉదయం 10 గంటలకు వాయిదా వేయబడెను.

## కార్యక్రమంలో మందకొడితనం

న్యూఢిల్లీ, నవంబర్ 6: రాజ్యాంగ పరిషత్ సమావేశం నేడు జరిగినంత మందకొడిగా మరెన్నడూ జరుగలేదు. సభ్యులలో సగంమందిదాకా హాజరుకాలేదు. పత్రికా విలేకరులకూడా సగానికి పైగా రాలేదు. అనవసర వివాదాలు వృథా కాలహరణం ఎక్కువగా ఉన్నవి. ఒక సభ్యుడు తన టెలిఫోన్ సౌకర్యాలకు గల ఇబ్బందులనుగురించి రాజ్యాంగ పరిషత్ సమావేశంలో ఏకరవు పెట్టటం జరిగిన దంటే సమావేశం ఏవిధంగా జరిగినదో ఊహించుకోవచ్చును.

భాషా విషయమై అనవసర వివాదం చాలాసేపు జరిగినది. హిందీ భాషలో నున్న రాజ్యాంగ ముసాయిదాను చర్చించవలెనని సేట్ గోవిందదాస్ మొదలైనవారు ఒత్తిడిపెట్టటం జరగ్గా, టి. టి. కృష్ణమాచారిగారు ఈ భాషా నిరంకుశత్వం దేశాన్ని మరి చీలదీయగలదని సవాలుచేసెను. ఈ వ్యవహార విధానం మాస్తే కాంగ్రెసు ప్రముఖులు సూచించినట్లు డిశంబరు 9 నాటికి రాజ్యాంగ ముసాయిదాపై చర్చ పూర్తికాకపోవచ్చునని అనిపిస్తున్నది. భారతి శాసనసభగా పరిషత్తు సమావేశమైనప్పుడు అధ్యక్షతవహించే మవ్లంకర్‌గారే అధ్యక్షతవహిస్తే కార్యక్రమం అనుకున్నప్రకారం పూర్తికాగలదనీ, రాజెన్‌బాబు అవసరమైనంత కరుకుగా ప్రవర్తించటం అవసరమని భావించబడుతున్నది. (స్వ. వి.)

## నెహ్రూ ఆధిక్యత

### శ్యామప్రసాద ముఖర్జీ ప్రశంస

కలకత్తా, నవంబరు 6: సర్వ విశ్వవిద్యాలయసంఘమువారి పత్రిక "శ్రీహర్ష" తాలూకు "పండిట్ జీ" ప్రత్యేక సంచిక నవంబరు 14 న, పండిత జవహర్లాలు 60 వ జన్మదినమునాడు వెలువడును. ఈ ప్రత్యేక సంచికకు సందేశము పంపుచు పార్శ్రామిక మంత్రి డాక్టరు శ్యామప్రసాద ముఖర్జీ నెహ్రూనుగురించి ఇట్లు వ్రాసెను:

"ఉన్నత శీలము, ఈ యుగమునందలి రాజకీయ సాంఘికశక్తులనురించిన పరిజ్ఞానము, ఉన్నతాదర్శములతో కూడిన జీవితపోరాటము కారణముగా నేడు పండిత నెహ్రూ ప్రపంచ అగ్రనాయకులలో ఒకడుగా నున్నాడు. మనమందరము ఆయన జన్మదినోత్సవము చేసికొందుము. కాని యువకులకు ఆయన జీవితమును కృతులును మార్గదర్శకములేకాక నీతిబోధకములుగాకూడ ఉపకరించగలవు. మొదటి స్వతంత్ర భారత ప్రధానియొక్క జీవితాదర్శములను అవగాహన చేసికొనుటకు మా విద్యార్థుల పత్రిక కృషిచేయుట మిక్కిలి ఉచితముగా నున్నది."

## కలకత్తా వోటర్ల జాబితా

కలకత్తా, నవంబరు 6.

స్వతంత్ర భారత రాజ్యాంగములో మొట్టమొదటి సాధారణ ఎన్నికలకుగాను కలకత్తా వోటర్ల జాబితా తయారుచేయు పని సాగుచున్నది. కలకత్తా పట్టణములో పదిలక్షలమందికి వోటుచేయు హక్కు కలుగునిమియు, అందులో మూడవవంతు స్త్రీలుండురనియు అంచనా వేయబడెను. మరి నవారములలో ఈ పని పూర్తి కాగలదు.

## నిజాం కాందిశీకుల పునరావాస సమస్య

### రాజా థోండీ రాజ్‌బహదూర్ రేడియో ప్రసంగం

#### కేంద్ర సలహాసంఘం ఏర్పాటు

హైదరాబాద్, నవంబరు 7: హైదరాబాద్ మిలిటరీప్రభుత్వ పునరావాసశాఖ మంత్రి రాజా థోండీ రాజ్‌బహదూర్, కల్లోల సమయంలో సంస్థానమును వదలి యూనియన్ ప్రాంతాలకు పోయిన కాందిశీకులు తిరిగి స్వస్థానములకు చేరుకొనుటలో సహాయం చేయుటకును, సంస్థానము సకు చుట్టుప్రక్కలనున్న యూనియన్ రాష్ట్రాలనుండి హైదరాబాద్ వచ్చిన ముస్లింలను తిరిగి వారి స్వస్థానములకు పంపించుటలో సహాయం చేయుటకును, 11 మందితో కూడిన ఒక కేంద్ర సలహాసంఘమును ఏర్పాటుచేసెను. ఈ సంఘంలోని వారు రాజాథోండీ రాజ్ బహదూర్ (అధ్యక్షులు), నగేంద్రబహదూర్ (పునరావాస శాఖ కార్యదర్శి), శివకుమార్ లాల్ (హోంశాఖ కార్యదర్శి), ఇల్లెందుల రామచంద్రరావు (రెవెన్యూశాఖ కార్యదర్శి), నసీర్ అహమ్మద్ ఖాన్ (ఆర్థికశాఖ డెప్యూటీ కార్యదర్శి), శ్రీనర్ నాయక్, మాడపాటి రామచంద్రరావు, కృష్ణమాచారి జోషి, ముల్లా అబ్దుల్‌బసీత్, శ్రీమతి టాహ్మినాషా, శ్రీమతి డా॥ రేజెల్లా.

#### మంత్రి రేడియో ప్రసంగం

రాజా థోండ రాజ్ బహదూర్ గత రాత్రి హైదరాబాద్ రేడియోలో ప్రసంగించుచు కాందిశీకులకు పునరావాస సౌకర్యాలను కల్పించుటలో మిలిటరీ ప్రభుత్వము ఎదుర్కొనుచున్న కార్యభారమును వివరించిరి. సంస్థాన ప్రజలలో అసహాయులుగా నున్నవారికి, అవసరమున్నవారికి అప్పుయిచ్చుటకుగాను మిలిటరీప్రభుత్వం 40 లక్షల రూపాయలను మంజూరు చేసినదని చెప్పిరి.

"ధ్వంసమైపోయిన యిండ్లు తిరిగి పునర్నిర్మింపబడవలెననీ, వ్యవసాయ పరికరములు, విత్తనములు పొందుటకుగాను కావలసినవారికి అవి సమకూరునట్లు చేయవలెననీ ప్రభుత్వ ఉద్దేశ్యం. ఇంతేగాక ప్రభుత్వం ప్రతిజిల్లా సివిల్ పరిపాలనాధికారివద్ద అసహాయులకు సహాయము చేయుటకుగాను 10 వేల రూ. ఉంచబడినవి. సంస్థానంనుండిపల్లి పోవుటవలన ప్రభుత్వోద్యోగములను పోగొట్టుకొన్నవారికి తిరిగి ఉద్యోగ సదుపాయములను కలుగజేయుటలో మిలిటరీ ప్రభుత్వం సహాయపడగలదు.

సంస్థానంలోని కాందిశీకులను 2 తరగతులుగా విభజించవచ్చును. ఒకటి ఇండియా ముస్లిం కాందిశీకులు. వీరిలో చాలమంది సంస్థానంలోకి వచ్చినచో ధనం, అధికారం పొందవచ్చునని కొంతమంది చూపిన ఎరకు ఆకర్షింపబడి వచ్చినవారు. కాలం గడచినకొద్దీ, సంస్థానంలో రాజకీయ పరిస్థితి చిక్కబడుటతో వీరు సంస్థానమునకు వచ్చుటలో తప్పుచేసినామని భావించుచున్నారు. అందుచే వారు తిరిగి యూనియన్ రాష్ట్రములలోని తమ స్వస్థానములకు పోవుట ప్రారంభించినారు. ఇప్పటికప్పుడే వీరిలో చాలమంది తమ స్వస్థానములకు వెళ్ళిపోయినారు. ప్రస్తుతం సంస్థానంలో నున్నది కొద్దిమంది మాత్రమే.

వారుకూడ తిరిగి తమ స్వస్థానమునకు వచ్చి సౌఖ్యవంతమైన జీవితమును గడుపగలరని విశ్వసించుచున్నారు. ఇక్కడనున్నవారి యోగక్షేమములను ప్రభుత్వం విచారించును. వారిలో అసహాయులున్న యెడల వారికి తినుటకు తిండి, వుండుటకు యిల్లు ఉచితంగా యివ్వబడును.

కాందిశీకులలో రెండవ తరగతి. వీరు వాస్తవానికి యిక్కడివారే. వీరు సంస్థానంలో కల్లోలసమయంలో రజాకార్ దౌర్జన్యములకు, హింసలకు భయపడి, యూనియన్ ప్రాంతాలకు తలదాచుకొనుటకు పోయినవారు. రాష్ట్రప్రభుత్వములు వీరికి అన్నివిధాలా సహాయం చేసినప్పటికీ వీరు కొన్ని కష్టములను అనుభవించినారనుటలో సత్యంలేకపోలేదు. వీరిలో కొంతమంది యిప్పటికే సంస్థానంలోని తమ స్వస్థానములకు చేరుకొన్నారు. అయితే యింకను అనేకమంది యూనియన్ రాష్ట్రములలోనే యిప్పటికీ వున్నారు. వీరిలో పట్టణవాసులు తమ స్థానములకు చేరుకొని యితరులకు పెద్ద యిబ్బందిలేకుండా జీవితమును సాగించుచున్నారు. పోతే వ్యవసాయవర్గమునకు చెందినవారు గృహములను పోగొట్టుకొనినవారు. వీరు తిరిగి మామూలు జీవితమును ప్రారంభించవలెననిన సహాయం అవసరం. మిగతా విషయములకంటే యీ విషయమునుగురించే ప్రభుత్వం అత్యంతశ్రద్ధవహించుచున్నది. కాందిశీకులు పునరావాస సౌకర్యములు కలిగించుటలోను, ముస్లిం కాందిశీకులను తిరిగి వారి స్వస్థానములకు పంపుటలోను ప్రభుత్వమునకు సహాయపడుటేకాక, కేంద్ర సలహా సంఘంవారు జిల్లాలలో పర్యటించి ప్రజలందరు సఖ్యతతో నుండవలసిందని ఉద్బోధించగలరని భావించుచున్నాను. గత సంవత్సరంలో సంస్థానమునకువచ్చిన ముస్లిం కాందిశీకులను తిరిగి వారి స్వస్థానములకు పంపుటలో సహాయ సంఘసభ్యులు తమ పలుకుబడిని ఉపయోగించగలరని ఆశించుచున్నాను. కేంద్ర సలహా సంఘముతో సహకరించి పనిచేయుటకుగాను యిటువంటి సంఘములే ప్రతి జిల్లాలోను ఏర్పాటుచేయబడును. అనాథాశ్రిత స్త్రీల సమస్యను గురించి జాగ్రత్తగా పరిష్కరించవలసియున్నది" అని రాజా థోండీరాజ్ బహదూర్ చెప్పెను.

## మోటారు,నౌకాపరిశ్రమలకు ప్రభుత్వ రక్షణ

న్యూఢిల్లీ, నవంబరు 5: దేశంలో ప్రధాన పరిశ్రమలను అభివృద్ధి చేయుటకై కొన్ని మార్గములను ఆలోచించుటకు, వాటి రక్షణకై ప్రభుత్వము తీసుకోవలసిన చర్యలను సూచించుటకు భారత ప్రభుత్వ పరిశ్రమల శాఖవారు తమ డైరెక్టర్ జనరల్ ఆధిపత్యాన 12 పరిశీలన సంఘాలను అంగీకరి నియమించి ఉన్నది. ఈ సంఘాలు తమ పరిశీలనలు పూర్తిచేసి ఇప్పుడు కొన్ని సూచనలను చేసినవి. కానిపరిశ్రమలశాఖవారు వాటిలో అధిక భాగం ప్రస్తుత పరిస్థితులలో ఆదరణయోగ్యంకాదని నిర్ణయించిరి.

పరిశ్రమల శాఖకు, వారే యేర్పరచిన ఉపసంఘములకూ గల ఈ వైరుధ్యం మోటారు, నౌకాపరిశ్రమల విషయంలో స్పష్టపడుతున్నది.

మోటారు పరిశ్రమ అభివృద్ధి ఉపసంఘం ఈ కింది ప్రధాన సూచనలను చేసి ఉన్నది.

(1) ప్రయాణీకుల కార్లకు 10 హార్స్ పవర్ ఇంజన్లనూ, లారీలకు 22 హార్స్‌పవర్ ఇంజన్లనూ మాత్రమే ఉపయోగించవలెను. (2) చిలరభాగాల తయారీ పరిశ్రమను రక్షించుటకై ఆ భాగాల దిగుమతిపై రక్షణ సుంకాన్ని పెట్టింపు చేయవలెను. (3) వివిధ భాగాలను కలిపి కార్లను తయారు చేసే పరిశ్రమ మన దేశంలో ఇప్పుడు తగినంతగా ఉన్నది కనుక 3 సం॥ వరకూ కొత్త కార్ఖానాలను స్థాపించనివ్వకూడదు.

ఈ సూచనలు టారిఫ్‌బోర్డు నిర్ణయంతో నిమిత్తం లేకుండానే అనుసరించవలెనని ఉపసంఘం కోరగా, టారిఫ్‌బోర్డు నిర్ణయం అవసరమని పరిశ్రమల శాఖవారు నిర్ణయించిరి.

### నౌకా పరిశ్రమ

నౌకాపరిశ్రమాభివృద్ధికై నియమించబడిన ఉపసంఘం ఈ కింది సూచనలను చేసినది. కొత్తగా నౌకా నిర్మాణశాలలను ఏర్పరచుటకై స్థలనిర్ణయము చేయుటకూ, విశాఖపట్టణ నిర్మాణశాలను అభివృద్ధిచేయుటకూ సలహానిచ్చుటకై ఇద్దరు ముగ్గురు విదేశ నిపుణులను ఆహ్వానించవలెను. సమావేశంలో పాల్గొన్న సింధియా కంపెనీ ప్రతినిధులు విశాఖపట్నంలోగల తమ నిర్మాణశాలలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవచ్చునని చెప్పగా ప్రస్తుతం అది వీలుకాదని చెప్పి, ఉపసంఘం ఒక విదేశీకంపెనీచేత ప్రొపెలరు యంత్రనిర్మాణశాలను స్థాపింపజేయవలెనని సూచించినది. ఈ కొత్తనిర్మాణశాలలో భారత ప్రభుత్వము పెద్దవాటాదారుగా ఉండి, కొంత కాలమైనపిదప దానిని స్వాధీనపరచుకోవలెనని ఉపసంఘం సూచించినది.

ఈ ఉపసంఘ సూచనలవలన అనేక సమస్యలు ఏర్పడుతున్నవి. (1) ప్రొపెలరు యంత్రి నిర్మాణానికై సొంత వ్యాపారస్తులచేత కర్మాగారం స్థాపింపజేసి ప్రతిపాదించటం, నౌకానిర్మాణం ప్రభుత్వపరంగా ఉండవలెనన్న ప్రభుత్వసూత్రానికి విరుద్ధంగా ఉన్నది. (2) ఉపసంఘంలో అధికారులు ఎక్కువగా ఉండటంవల్ల పై సూచనలననుసరించి ప్రభుత్వం తన విధానాన్నే మార్చుకునే అవకాశం ఏర్పడుతున్నది (3) ద్రవ్యోల్బణ అధికంగా ఉన్న ఈ రోజులలో సొంతవ్యాపారస్తులకు ఇటువంటి అవకాశం చూపటం మంచిదే. (స్వ. వి.)

## 65 వ కాంగ్రెసు సమావేశములో వసతి ఏర్పాటులు

లక్నో, నవంబరు 6: 65 వ కాంగ్రెస్ సమావేశఆహ్వానసంఘ కార్యదర్శి రాష్ట్ర కాంగ్రెసు సంఘములను ఈ విధముగా కోరెను: రాగల కాంగ్రెసు సమావేశమునకు హాజరగు ప్రతినిధులు, ఆహ్వానితులు మొదలగువారి సంఖ్యలను డిసెంబరు 1 వ తేదీలోగా పంపినచో వారికొరకు గాంధీ నగరులో బసలు ఏర్పాటు చేయబడును; ముందుగా తమ అంగీకారములను తెలియచేసి వసతు లేర్పాటు చేయించుకొనని వారికి సౌకర్యములు లభించవు.

కాంగ్రెసు సమావేశమునకు తమతమ రాష్ట్రములనుంచి ఎందరెందరు వచ్చుచున్నదీ, ఎప్పుడు ప్రయాణము చేయుచున్నదీ తెలుపవలసినదిగా కోరు చూ ఆహ్వానసంఘంవారు రాష్ట్ర కాంగ్రెసు కమిటీలకు లేఖలు పంపిరి.

## "పటేలు భాషారాష్ట్ర విభజన కూడదనుట అక్రమం"

### శ్రీ బులుసు సాంబమూర్తి గారి నిరసనము

చన్నపురి ఆంధ్రుల సభలో హైదరాబాదు, బస్తరుగూర్చి ప్రసంగాలు

మదరాసు, నవంబరు 6: చన్నపురి ఆంధ్రమహాసభవారి యాజమాన్యమున నిన్న సాయంకాలం జరిగిన బహిరంగ సభలో శ్రీ బులుసు సాంబమూర్తిగారు పటేలు నెహ్రూల ప్రసంగాలను తీవ్రంగా విమర్శించిరి.

కర్నలు తాడేపల్లి శంకరశాస్త్రిగారు ముందుగ ప్రసంగించుచు, హైదరాబాదు చరిత్రను విపులంగా తెలిపిరి. హిందూ సంస్థానమయిన హైదరాబాదు పరిపాలకులచే క్రమేపి ముస్లిము సంస్థానంగా మారిపోయిందని, ఉత్తరప్రాంతాలనుండి ముస్లిము ఉద్యోగులను దిగుమతిచేసిరనియు తెలిపిరి. ఇపుడు హైదరాబాదు గవర్నరుగానున్న మేజరుజనరలు చౌదరిగారు పర్జునగానుండిన కర్నలు చౌదరిగారి అన్నకొడుకనియు, మలయాలో జనరలు మసర్వి గారికడ్డ మిలిటరీ పరిపాలనానుభవం కల్గివచ్చి హైదరాబాదును జయించి సమర్థతతో పరిపాలిస్తున్నారనిరి. 1946 లో తాను మలయా పోయినపుడు వారివద్ద పనిచేస్తినని, శాస్త్రిగారు తెలిపిరి. "మసర్విగారు, పాకిస్తాను సేనాధిపతిగనుండి పింఛను గైకొన్నవారు లండనులో వావెలు అధ్యక్షతను జరిగిన సభలో కాశ్మీరు పాకిస్తానుకి యిస్తేగాని ప్రపంచంలో శాంతి యుండదన్నదాన్నిబట్టి, భారతదేశం చిక్కులన్నిటికి ఆంగ్లేయులే కారణమని తెలియగలదు, బస్తరు సంస్థానం లోహ సంపద వంతను హైదరాబాదునకు తాకట్టు పెట్టే యేర్పాటు అచటి రాజకీయ ఏజెంటులయిన ఇంగ్లీషు ఉద్యోగి చేసినట్లు తాను అరికట్టినట్లు సర్దారు పటేలు నిన్న నాగపూరులో చెప్పెను. అందుకే వారు ఇంగ్లీషువారు పూర్తిగ పోతేగాని ఇండియా ఐక్యత కుదరదని చెప్పిరి. హైదరాబాదులో మూడు భాషాభాగాలు విడిపోయి ఆయా మాతృభాషా రాష్ట్రాలలో చేర్చుటకు కేంద్ర ప్రభుత్వానికి రాజకీయ మొగమాటాలు అడ్డువస్తున్నా నూతన రాజ్యాంగ విధానం అమలు జరిగేవరకు హైదరాబాదులో మిలిటరీ పరిపాలన కొనసాగాలి" అని కర్నల్ శాస్త్రిగారు సూచించిరి.

శ్రీ బులుసు సాంబమూర్తిగారు, కల్లి నరశింహంగారు (బస్తరు వకీలు) అర్జంటు పనిమీద స్వస్థానానికి వెళ్ళిపోవలసి వచ్చినందున వారు సభకు రాలేకపోయిరని తెలిపి, బస్తరు సంస్థానం తెలుగురాజ్యంలో చేరవలసిన అవసరం గూర్చి, ఇంద్రావతినదికి దక్షిణభాగం పూర్తిగ ఆంధ్రభాగమని రుజువుచేసే డాక్యుమెంటులు గలవనియు నుడివిరి.

"భాషాప్రయుక్త రాష్ట్ర సంఘం విచారణ చేయుచుండగానే, వారి నివేదిక తయారుకాకుండానే, యీ విభజన యిపుడు కూడదని ప్రధాని నెహ్రూ, ఉపప్రధాని పటేలు బహిరంగంగా ప్రకటించడం అక్రమం. ప్రజాపరిషత్తు అధ్యక్షుడు వారిని మందలించవలసి యుండెను. భాషా రాష్ట్రాలు లేకపోబట్టి ఇంగ్లీషువారు పోయినా ఇంగ్లీషుభాష మనలను విడువకున్నది. స్వాతంత్ర్యం వచ్చినట్లు ప్రజలు భావించుటలేదు. ప్రజలభాషలో పరిపాలన చేయలేని ప్రభుత్వం డిమాక్రసీ అనిపించుకోదు. కనుక పటేలు కాంగ్రెసువారెవ్వరు భాషారాష్ట్ర విభజనగూర్చి మాట్లాడకూడదని నాగపూరులో అనుట, కాంగ్రెసు అధ్యక్షుడను డా॥ పట్టాభిగారిని నోరుమూసుకోమని ఆజ్ఞాపించినట్లున్నది. పటేలుగారు పట్టాభిని అభినందించుచు "మా అభినందనలకన్న మా సానుభూతి సహాయాలు ఎక్కువ అవసరం." అన్నారు. డా॥ పట్టాభిగారు అభినందనలకు బదులు చెప్పుతూ తాను "ముసలి అత్తగారి"ని అన్నాడు. కాంగ్రెసు అధ్యక్షుడు అధికారం తీసుకోవాలి, తన అభిప్రాయాలు అమలు జరపాలి గాని, ముసలి అత్తగారుగా నుంటేట్లయితే, అధ్యక్షునిగా నుండనక్కరలేదు. రాజీనామానిచ్చి రావచ్చు, బోసువలె సామ్యవాస్తే గానున్న నరేంద్రులను పెట్టి చదరంగం ఆడటం పనికిరాదు. హైదరాబాదు ప్రజలంతా నైజాంబోవాలి, మూడు ముక్కలుగా సంస్థానాన్ని విభజించాలని ఘోషపెడుతున్నారు. వారందరూ నిజాం రాజ్యంలో సంచారంచేసి తెలుసుకున్నాను. నిజాం భావిస్థితినిగూర్చి ప్రజల నిర్ణయానికి విడువాలికాని, పటేలుగారు ముందుగా యిట్లాంటి ప్రచారం చేయరాదు. ఆంధ్రరాష్ట్ర ప్రజలు రెండుకోట్లమంది ఆంధ్రరాష్ట్రం కావాలంటూవుంటే, యిపుడు వద్దనడానికి పటేలుకేం అధికారం ఉంది? 16 వ తేదీన పటేలు విశాఖపట్నం వస్తున్నారు. అపుడు ఆంధ్రులంతా అతనికి నచ్చచెప్పాలి. ప్రత్యేక రాష్ట్రం రాకపోతే ఆంగ్లం లేక హిందీ భాషాదాశ్యం తప్పదు. ఇంగ్లీషుభాషస్థానే హిందీభాష ఆక్రమించిందంటే, దానివల్ల చాల చిక్కులువచ్చును. మాతృభాష అడుగంటుతుంది. అందుకేంత మాత్రం అంగీకరించరాదు. భాషా సమస్య చాల బ్రహ్మాండమయింది. బాగా ఆలోచించి, రాష్ట్రపతి డా॥ పట్టాభి సహాయంతో దీన్ని పరిష్కరించే మార్గం ఆలోచించాలి." అని సాంబమూర్తిగారు నుడివిరి.

కర్నలు శాస్త్రిగారు సభను ముగించుచు, హైదరాబాదులో దుండగాలకు కారణమయినవారందరికి బహిరంగ విచారణ జరిపించి శిక్షించాలనిరి.

### ఉద్యోగుల నేరాలకు శిక్షలు

1948 ఏప్రిలు 1 నుండి జూను 30 వరకు ప్రభుత్వోద్యోగులలో నేరాలుచేసి శిక్షలు పొందినవారి సంఖ్యలు వివిధ శాఖలలో యీ దిగువరీతి గలవు:-

వ్యవసాయశాఖ-7, సివిలు సప్లయి-23, పరిశ్రమలు వ్యాయశాఖలందు చెరి ఒకరు, పోలీసు, రిజిస్ట్రేషను శాఖలందు చెరి యిద్దరు.

### ఉద్యోగుల మార్పులు

జి. ఎస్. ఎస్. రామమూర్తిగారు, కర్నూలునుండి విశాఖపట్నం డిప్టీకలక్టరుగ సి. నారాయణప్రకాశరావుగారిస్థానే మార్చబడిరి.

### ఉపాధ్యాయులైన పోస్టుమాస్టర్లు

గ్రామాలందు పోస్టుమాస్టర్లుగ పనిచేయుచున్న ప్రభుత్వ ఉపాధ్యాయులు లేక జిల్లాబోర్డు ఉపాధ్యాయులకు పోస్టలు శాఖవారిచే కరువుభత్యంకాక, రాష్ట్రప్రభుత్వం రేటుప్రకారం కూడ కరువుభత్యం 1-9-48 తేదీనుండి యిచ్చుటకు మదరాసుప్రభుత్వం వారు నిశ్చయించిరి.

### ఐ. ఎన్. ఎ సైనికులకు గ్రాంటులు

భారతీయ సైన్యంలోచేరి తదనంతరం బోసుగారి ఇండియను నేషనలు ఆర్మీ (ఐ. ఎన్. ఎ) లో చేరి గాయపడినవారికి చనిపోయినవారి కుటుంబాలకు కేంద్ర ప్రభుత్వంవారు ధనసహాయం చేయదలచిరి. అట్టివారు నవంబరు 30 తేదీలోగా ఇండియా అడుజెంటు జనరలు, పి. ఎస్. 4 ఎ, ఆర్మీ కేంద్రం, న్యూఢిల్లీకి దరఖాస్తు పెట్టుకోవలెను.

### బర్మాలో హక్కులు

బర్మా రాజ్యంలో నుండిన ప్రభుత్వోద్యోగులు, పారివచ్చుటకు పూర్వం గల జీతాలు శలవులు మున్నగు హక్కులగూర్చి దరఖాస్తులు పెట్టుకొనుటకు నవంబరు 30 తేదితో గడువు అంతరించునని ప్రభుత్వం వారు ప్రకటించుచున్నారు.

### అసభ్యపు పత్రికలు

"కావల్" (పుదుకోట) "చిరంజీవి," మదరాసు రెండు అరవ పత్రికలలో యువకులను అవినీతిలో దించుటకు ప్రోత్సహించే వ్రాతలు పటములు ప్రకటింపబడుచున్నందున వాటిపై కోర్టులో చర్య తీసుకొన ప్రభుత్వంవారు ఉత్తరువు చేసిరి.

### మంత్రుల సంచారం

గౌ॥ శ్రీ మాధవమీననుగారు 8 వ తేదీ రాణిపేటపోయి రాత్రికి తిరిగివత్తురు.

గౌ॥ డా॥ ఎస్. గురుపాదంగారు, హిర్కా డెవలప్మెంటు మంత్రి 11 తేదీన ఉదయం మదరాసువిడచి, కోయంబత్తూరు, మలబారు జిల్లాలు సంచారంచేసి 17 తేదీ మధ్యాహ్నం తిరిగివత్తురు.

## మదరాసు రేడియో

### నవంబరు 9 మంగళవారం

మదరాసు (2)

7-0 గం. స్వాగతం 7-10 తెలుగులో వార్తలు. 7-30 ఎస్. కృష్ణమూర్తి పాట. 8-0 ఇ. వార్తలు. 8-30 ఎస్. ఎస్. రంగనాయకి, ఎస్. ఎస్. రుక్మిణిగార్ల పాట. 12-30 హైస్కూల్సుకు- అరవం. 1-0 మహిళామండలి, నిష్కాపట్యం ప్రసంగం దంతముల పరిశుభ్రత, ప్రసంగం. ఫిడేలు వాయిద్యం. 1-30 ఇ. వార్తలు. 2-5 తెలుగులో వార్తలు. 4-0 ప్రాథమిక పాఠశాలలకు తెలుగు. 4-30 ఇ. రికార్డులు, 5-30 టి. ఆర్. పాప, ఫిడేలు. 6-0 ఇం. వార్తలు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం జడభరతుని కథ, పురాణం. అంటువ్యాధుల నివారణ, డాక్టరుతో సంభాషణ కృష్ణదేవరాయల భజనగీతి. విశేషాలేమిటి. 7-15 తెలుగులో వార్తలు. గ్రంథవిమర్శ పి. ఆర్. ఫ్రాంసిసుగారు 7-45 కరియకుడి సాంబశివయ్యరు, వీణ. 9-0 ఇం. వార్తలు. 9-15 తమిళప్రసంగం. 9-40 వి. ఎస్. లక్ష్మీనారాయణను, పాట. ఇతరవేళలందు ఫిల్ము రికార్డులు.

## గాంధిహత్యకేసు

### 8 వ తేదీ గాడ్సే వాఙ్మూలం

ఢిల్లీ, నవంబర్ 6: ఈవేళ గాంధీజీ హత్యకేసు విచారణలో, ముద్దాయి డా॥ పర్చూరె ఇంటిని సోదాచేసినప్పుడు దొరికిన జనన లగ్నపత్రికలనూ, ఫోటోలనూ పరిశీలించినటువంటి సాక్షులు కొందరు పర్చూరె తండ్రి సదాశివపర్చూరె ఆ పత్రాలలో పేర్కొనబడినట్లు, ఫోటోలో అతడుకూడ ఉన్నట్లు తెలియజేసిరి. ఇంటి సోదా సమయంలో పంచాయతీదారుగానున్న శ్యాంబహదూర్ (గ్వాలియర్ వాస్తవ్యుడు), ఆదిత్యరాం అనే జ్యోతిష్కుడు, గ్వాలియర్ సంస్థానంలో రిటైర్డ్ ఉద్యోగి మేజర్ జీల్, లష్కర్ (గ్వాలియర్) పోలీసు సబిన్స్పెక్టర్ వీరేంద్రసింగ్ లు ఈ సాక్ష్యము నిచ్చిరి.

అనంతరం విచారణ 8 వ తేదీకి వాయిదాపడినది. ఆనాడు నాథూరాంగాడ్సే వాఙ్మూలం రికార్డు చేయబడును.

### దీపావళి ఉత్సవం

బొంబయి, నవంబరు 4: దీపావళి సందర్భమున, స్థానిక ఆంధ్రమహాసభవారీ వారం రసవంతమైన కార్యక్రమమును యేర్పాటు చేసినారు. మంగళవారం సాయంకాలం దేవరకొండ సుబ్రహ్మణ్యంగారి ప్రార్థనతో సమావేశం ఆరంభమైనది. సంగీత కార్యక్రమములో పాల్గొనినముఖ్యులు ఆచార్యగారు (వీణ) ఎం. సోమేశ్వరరావుగారు (ఫిడెల్), రామమూర్తిగారు (ఫిడేలు) డి. సుబ్రహ్మణ్యంగారు (మృదంగం) రాజామణిగారు మోర్సింగు.

సాహిత్య కార్యక్రమంలో గంటి సూర్యనారాయణగారు వ్రాసిన "మంత్రులు-లంచాలు" అను సంభాషణ వ్యాసమును అధ్యక్షులూ జి. డి. కాశేగారు చదివినారు. బొంబయిలో నివాసములు దొరకకపడేకష్టాలు ప్రతిబింబిస్తూ తాము వ్రాసిన ఆచంట మల్లన్న అను కథను కోడవటి గంటి కృష్ణమూర్తిగారు చదివిరి. "తెలుగువాడను నేనేరా" అను గీతాన్ని పప్పు సుబ్రహ్మణ్యంగారు, "కిన్నర వైభవము" గీతాల్ని వి. రామలింగస్వామిగారూ పాడిరి. చాలమంది ఆంధ్రులు, స్త్రీలు సహితం, హాజరై ఆనందించిరి.

### మొహరం పండగ విధి నిషేధాలు

మచిలీపట్నం, నవంబర్ 6: కీరపండరిపురం (చిలకలపూడి) లో కార్తీక శుద్ధ ఏకాదశి పర్వదినమగుట ఆరోజునే మొహరం 10 వ రోజగుట తటస్థించినందున శాంతికి భంగము కలుగవచ్చుననే ఉద్దేశముతో స్థానిక సబ్ డివిజనల్ మేజస్ట్రేటు గారు 144 వ సెక్షను ప్రకారం ఆరోజున పంజాలు, మసీదుల ముందు హిందూ మేళములు చేయరాదని, దేవాలయాల ముందుగా అల్లామాలు జన్ను మన్నప్పుడు ఆలయాలలో కూడ మేళములు చేయరాదని నిషేధించిరి. మొహరం ఊరేగింపులకు కొన్ని మార్గములుకూడ నిర్ణయించిరి.

### కడప

కడప, నవంబర్ 6: కడపపట్టణంలోను, తాలూకాలోను మొహరంపండగ సందర్భమున, ఈనెల 2, 12 తే మధ్య, జిల్లా మేజస్ట్రేటు అనుమతి పొందనిదే ఊరేగింపులు మొదలైనవి జరుపరాదని జిల్లా మేజస్ట్రేటుగారు 144 వ సెక్షన్ ప్రకారం ఉత్తర్వు చేసిరి.

### తాడేపల్లి గూడెం తాలూకా హరిజన సేవా సంఘం

తాడేపల్లి గూడెం, నవంబరు 1: ఈ తాలూకా హరిజన సేవాసంఘం సమావేశం వెలగల దానరెడ్డిగారి అధ్యక్షతను నిన్న జరిగెను. అధ్యక్షులు మాట్లాడుచు యిప్పుడు హరిజన హాస్టలులో 31 మంది విద్యార్థులున్నారనియు, విరాళములు యింకా పరిపిగా వసూలు చేయవలసిందనియు చెప్పిరి. హరిజన హాస్టలు నిధికిగాను ఒక నాటకం వేయించుటకు నిర్ణయించిరి. పై సంఘమునకు కార్యదర్శిగా కామిశెట్టి వెంకటనర్సయ్య ఎన్నుకొనబడెను.

తాడేపల్లి గూడెంలో దామోజీపురపు మాధవరావుగారు అధ్యక్షులుగా హరిజన సేవాసంఘం స్థాపింపబడెను.

ఈంగుటూరు పంచాయతీ బోర్డువారు మొన్న సమావేశమై గ్రామంలో యిండ్లులేని వారిసంఖ్య దాదాపు 200 ఉన్నదనియు, అందుచే ఊరువకు దగ్గర నున్న భూమిని స్వాధీనం చేసుకొనుటకు, రోడ్లువేయుట కగు ఖర్చును బోర్డు భరించుటకు నిర్ణయించిరి.

తాడేపల్లి గూడెం పంచాయతీ బోర్డు బుద్ధన వెంకటస్వామినాయుడుగారి అధ్యక్షతను సమావేశమై పంచాయతీ బోర్డును మునిసిపాలిటీగా చేయవలసిందని ప్రభుత్వమును కోరుచూ తీర్మానించిరి.

భమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారి షష్టిపూర్తి సందర్భమున సంచిక ప్రచురింపబడునని, వారినిగురించిన రచనలుపంపువారు నవంబరు ఆఖరులోగా తమకు పంపవలెనని కృష్ణాజిల్లా పామర్రునుంచి కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు వ్రాసిరి.





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G.T. Madras.